# తొలి తెలుగు శాసనం

**డా॥ వేంపల్లి గంగాధర్**

e-mail : gangadhar.vempalli@gmail.com

Web : www.vempalligangadhar.com



ప్రథమ ముద్రణ : డిశంబర్ 2013

ప్రతులు : 1000

ముఖ చిత్రం : రమణజీవి

డి.టి.పి.:
**శివరామ్ గ్రాఫిక్స్,** కడప.

ప్రచురణ :
**దేవినేని సీతారావమ్మ ఫౌండేషన్**
తెన్నేరు – 521 260, కృష్ణాజిల్లా.

ముద్రణ :
**శ్రీశ్రీ ప్రింటర్స్**
విజయవాడ, 9490634849

ప్రతులకు :
**అన్ని ముఖ్య పుస్తక కేంద్రాలు**

రూ. 60/–

*'దక్షిణాపథాన్నంతనీ ఆదిలో పాలించిన సాతవాహనుల దుర్గాలూ, టంక సాలలూ నేటి తెలంగాణాలో ఉండవచ్చు. ప్రపంచ విఖ్యాతిని ఆర్జించుకొన్న బౌద్ధారామాలూ, స్థూపాలూ కోస్తా జిల్లాలలో ఉండవచ్చు. కాని తెలుగు లిపిలో ఉన్న మొట్టమొదటి తెలుగు శాసనాలన్నీ మనకు రాయలసీమలోనే దొరికాయి. దొరికినంతమటుకు రేనాటి చోళుల మొత్తం 33 శాసనాలలోనూ మొదటిది ప్రాచీనమైనది ధనుంజయుని కలమళ్ళ శాసనం.'*

**- ఆరుద్ర**

**(సమగ్రాంధ్ర సాహిత్యం - మొదటి భాగం నుంచి)**

Our Special Thanks

**SRI DITTA KAVI KANNA BABU,**
Central Public Information Officer,
Archeological Survey of India,
Hyderabad Circle.

**Sri K. Muni Ratnam Reddy**
Office of the Director (Epigraphy),
Mysore.

**Sri Thiru S. Selva Arasu,**
Assistant Director (Admn),
Government Museum, Egmore, Chennai.

**Sri Avathanam Umamaheswara Sastry**

**Sri K. Srinevasulu**

**Sri B. Gurrappa**

**Sri Mantri Pragada Chandra Sekhar**



# రాజ లాంఛనము

రేనాటి చోళులరాజ్య లాంఛనము సింహము. తోకను వీపుపైనచుట్టు త్రిప్పి ఎడమవైపు నిల్చున్న అసమాన పౌరుష, పరాక్రమాలను చాటుతున్నట్లుగా ఆకృతి కల్గి వుంటుంది.

రేనాటి చోళులు సూర్యారాధకులు. చోళ మహారాజు ఆజ్ఞ ప్రకారం సూర్యగ్రహణ నిమిత్తం సూర్యునికి దేవాలయమును నిర్మించి దేవభోగార్థం కొంత భూమిని, ఒక గానుగను దానమిచ్చినట్లు చిలంకూరు శాసనం (S.I.I. Vol. X. No. 593) వలన తెలుస్తోంది.

తెలుగు అక్షరానికి తొలి వెలుగు.

తెలుగు భాష పరిణామ వికాసానికి తొలి అడుగు.

తెలుగు భాషకు రాజభాష హోదాను, శాసనభాషగా ఒక అధికార ప్రతిపత్తి కల్గించి, చారిత్రకంగా, సాహిత్యపరంగా 'ప్రాచీన హోదా'ను అందించిన కీలక ఆధారం. కడప జిల్లా కలమళ్ళ గ్రామంలోని శ్రీ చెన్నకేశవ స్వామి ఆలయ ప్రాంగణంలో క్రీ.శ. 575 ప్రాంతంలో రేనాటి చోళరాజు ధనుంజయుడు వేయించిన శాసనం - కలమళ్ళ శాసనం. 1904లో మద్రాసు శాసన పరిశోధన విభాగం వారు దీనిని గుర్తించారు. 1947-48లో ఆచార్య కె.ఏ. నీలకంఠ శాస్త్రి, యమ్. వెంకటరామయ్య ఈ శాసనాన్ని పరిష్కరించి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రచురించారు. ప్రాచీన లిపి ఆధారంగా ప్రప్రథమ తెలుగు శాసనంగా భారతీయ పురాతత్వ శాఖ అంగీకరించింది. ఈ శాసనం పొడవు 42 అంగుళాలు, వెడల్పు 9 అంగుళాలు. ప్రస్తుతం కలమళ్ళ శాసనం ఆచూకీ లభించడం లేదు. చర్చ జరుగుతోంది.



# తొలి తెలుగు శిలాక్షరం

తెలుగు భాషకు వెలుగు పూలు పూయించిన తొలి తెలుగు శాసనం... కలమళ్ళ శాసనం.

2013వ సంవత్సరం 'తెలుగు భాష, సంస్కృతి వికాస సంవత్సరం'. అటు చరిత్రకు - ఇటు భాషకు మధ్య నిలువెత్తు శిఖరంలా నిలిచిన తొలి తెలుగు శాసనం ఎక్కడుంది? చరిత్రకందని మిస్టరీలా మారింది. క్రీ.శ. 575 ప్రాంతానికి చెందిన రేనాటి చోళరాజు ధనుంజయవర్మ కడప జిల్లాలోని కలమళ్ళ గ్రామంలో గల శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం ప్రాంగణంలో వేయించిన దాన శాసనం తొలి తెలుగు శాసనంగా చరిత్రలో గుర్తింపు పొందింది. తెలుగు భాషకు ప్రాచీన హోదా లభించడానికి చూపిన ఆధారాల్లో ప్రధానమైనది కూడా! ప్రస్తుతం ఈ శాసనం ఎక్కడుంది? ఈ ప్రశ్నకు ఎవరూ సమాధానం చెప్పలేకపోతున్నారు. 1904 సం.లో మద్రాసు నుంచి వచ్చిన శాసన పరిశోధన విభాగంవారు తమ వెంట దానిని తీసుకెళ్ళిపోయినట్లు యింతవరకు భావిస్తూ వచ్చారు. ఇదే అంశాన్ని ఆధారాలు చూపిస్తూ నేను సమాచార హక్కు చట్టం క్రింద చెన్నైలోని ఎగ్మోర్ ప్రభుత్వ మ్యూజియాన్ని సంప్రదించినప్పుడు దిగ్భ్రాంతి కల్గించే అంశం బయటపడింది. 07 జనవరి 2013 నాడు శాసనం నమూనా ప్రతిని, స్క్రిప్ట్‌ను జతపర్చుతూ సమగ్ర వివరాలతో చెన్నై 'ఎగ్మోర్' ప్రభుత్వ మ్యూజియం వారిని ప్రశ్నించడం జరిగింది.

తొలి తెలుగు శాసనం, రేనాటి చోళరాజు ధనుంజయ వర్మ వేయించిన శాసనంకు సంబంధించిన వివరాలు, మ్యూజియంలో ప్రదర్శిస్తున్నారా? దానిని తగిన విధంగా సంరక్షిస్తున్నారా? వంటి ప్రశ్నలను వారి ముందుంచినప్పుడు - అలాంటి శాసనమేదీ తమ వద్ద లేదని - చెన్నై ప్రభుత్వ మ్యూజియం అసిస్టెంట్ డైరెక్టర్ తిరు ఎస్. సెల్వ అరసు, అధికారికంగా లిఖితపూర్వకంగా సమాధానమిచ్చారు.

దీంతో యింతకాలంగా ఎగ్మోర్ మ్యూజియంలో వుందని భావిస్తూ వచ్చిన శాసనం అక్కడ లేదని తేలిపోయింది. అంతకు మునుపే శాసన నిర్దేశకుల కార్యాలయం, భారతీయ పురాతత్వశాఖ, మైసూరు వారి వద్ద కూడా ఈ శాసనం లేదని వెల్లడైంది. ఈ శాఖ ఎపిగ్రాఫియా ఇండికా, ఏన్యువల్ రిపోర్ట్ ఆన్ ఇండియన్ ఎపిగ్రఫీ అనే శాసన పత్రికలను కూడా ప్రచురిస్తోంది. ఈ కార్యాలయానికి 125 సంవత్సరాల చరిత్ర కూడా వుంది. వీరి వద్ద రేనాటి చోళుల శాసనాలకు సంబంధించిన ప్రాథమిక సమాచారం వుంది.

ఇదే విధంగా భారతీయ పురాతత్వ సర్వేక్షణ, ఉప పురాతత్వ అధీక్షకులు - హైదరాబాదు వారిని కూడా 30 అక్టోబర్ 2012నాడు రెండు లేఖల ద్వారా ప్రశ్నించడం జరిగింది. సమాచార హక్కు చట్టం ద్వారా భారతీయ పురాతత్వశాఖ, హైద్రాబాదు మండలం వారిని ఈ అంశంపై అడిగిన కొన్ని ప్రశ్నలు - వాటికి వారిచ్చిన సమాధానాలు ఇవి:

? కడప జిల్లాలో బయల్పడిన 'కలమళ్ళ శాసనం' ప్రస్తుతం ఎక్కడ వుంది?

జ. కలమళ్ళ గ్రామంలో గల శ్రీ చెన్నకేశవస్వామి ఆలయ ప్రాంగణంలో 1904లో మద్రాసు నందలి శాసన పరిశోధన విభాగం వారు ఈ శాసనాన్ని గుర్తించారు. ప్రస్తుతం ఎక్కడ వుందో తెలియదు.

? కలమళ్ళ శాసనం పొడవు, వెడల్పు, ఆకారం, బరువు వంటి సాంకేతిక వివరాలు తెలపగలరు?

జ. కలమళ్ళ శాసనం పొడవు, వెడల్పు, ఆకారం, బరువు వంటి సాంకేతిక వివరాలు లభించుట లేదు.

? కలమళ్ళ శాసనాన్ని మొదటిసారిగా ఎవరు, ఎప్పుడు, ఎక్కడ గుర్తించారు? తర్వాత ఎక్కడికి తరలించారు? ప్రస్తుతం ఎక్కడుంది?

జ. కలమళ్ళ శాసనాన్ని తొలిసారిగా 1904లో మద్రాసు ప్రభుత్వ శాఖ వారు కలమళ్ళ గ్రామంలోని ఆలయ ప్రాంగణంలో వున్నట్లు

గుర్తించారు. తర్వాత 1947-48లో ఆచార్య కె. నీలకంఠ శాస్త్రి యమ్. వెంకట రామయ్య ఈ శాసనాన్ని పరిష్కరించి ప్రచురించారు.

ఇంతకు మించి ఏ సమాచారం అందుబాటులో లేదు.

? తొలి తెలుగుశాసనంగా చెప్పబడుతున్న కడప జిల్లాలోని కలమళ్ళ శాసనంను భారతీయ పురాతత్వ శాఖ తొలి తెలుగు శాసనంగా అంగీకరిస్తోందా? అంగీకరిస్తే ఆధారాలు తెలుపగలరు?

జ. రేనాటి చోళరాజు ధనుంజయుడు వేయించిన కలమళ్ళ శిలాశాసనాన్ని తొలి తెలుగు శాసనంగా ప్రసిద్ధ శాసన పరిశోధకులు సహేతుకంగా నిర్ణయించారు. కావున మేము కూడా వారి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాము. నేటికి లభించిన తొలి తెలుగు శాసనాల్లో కలమళ్ళ శాసనమే ప్రప్రథమ మనడానికి అందులో వాడిన ప్రాచీన లిపి-భాషలే ప్రమాణం. ఎరికల్ ముత్తురాజు వేయించిన ఎర్రగుడిపాడు శాసనం, పుణ్యకుమారుడి తిప్పలూరు శాసనాలు తర్వాత క్రమంలో వచ్చి చేరుతాయి.

ఇదే అంశంపై 09-04-2013 నాడు రాష్ట్ర పురావస్తు శాఖ వారిని వివరాలు కావాలని కోరినప్పుడు వారి నుంచి కూడా దాదాపు ఇవే రకమైన సమాధానాలు వచ్చాయి. "కడప జిల్లాలో బయల్పడిన కలమళ్ళ శాసనం ప్రస్తుతం ఎక్కడ ఉన్నది ఖచ్చితంగా తెలియకున్నది. (1967లో పురావస్తు శాఖ వారు ఈ శాసన నకళ్ళను కలమళ్ళ గ్రామంలోనే తీసుకొని రావడం జరిగింది) ఈ శాసనం పొడుపు 42 అంగుళాలు, వెడల్పు 9 అంగుళాలు కలిగివున్నట్లు శాసన నకలు ద్వారా తెలియుచున్నది. ఈ శాసనము పై భాగములో వెడల్పు తక్కువగా వున్నది." అని వారు ఇచ్చిన లేఖలో ఒక ప్రశ్నకు జవాబిచ్చారు.

మరో ప్రశ్నకు సమాధానమిస్తూ "కలమళ్ళ శాసనాన్ని మొదటి సారిగా 1967లో రాష్ట్ర పురావస్తుశాఖ వారు నిర్వహించిన కడప జిల్లా శాసనాల సర్వేలో శ్రీ జి. జవహర్‌లాల్, అసిస్టెంట్ ఇన్ ఎపిగ్రఫి వారు కనుగొని కాపీ

చేయించడం జరిగింది. తదుపరి శాసనం శిల ఎవరు ఎక్కడికి తరలించారో తెలియకున్నది. దినపత్రికలో వచ్చిన సమాచారం మేరకు చెన్నై ప్రభుత్వానికి లేఖరాసి పరిశీలించవలసిందిగా కోరుచున్నాము." అని లిఖిత పూర్వంగా తెలియపర్చారు.

శాసన నిర్దేశకుల కార్యాలయం, మైసూర్ వారి వద్ద తొలి తెలుగుశాసనానికి సంబంధించిన నకలు Estampage (Copy of the Inscription taken on paper by Manual Process) అందుబాటులో ఉంది. Indian Epigraphy No. A. 380 లో దీనికి సంబంధించిన సమాచారం అందించారు. అలాగే Epigraphia Indica Vol. XXVII article No. 42 లో రేనాటి చోలుల శాసనాల గురించిన వివరాలు ప్రచురించినట్లు స్పష్టం చేశారు.

ఈ ప్రయత్నంలో సంప్రదింపులుగా వివిధ దశలుగా సాగిన తొమ్మిది లేఖలను యథాతథంగా ఆధారాలుగా ఈ పుస్తకంలో పొందపర్చడం జరిగింది.

## చరిత్ర పుటల్లో...

ఆంగ్లేయుడైన కల్నల్ కాలిన్ మెకంజీ 1782లో ఈస్టిండియా కంపెనీ వారి ఇంజనీరింగ్ శాఖలో ఉద్యోగం నిమిత్తం ఇండియా వచ్చాడు. కారన్ వాలిస్ సూచన మేరకు దత్తమండలాల్ని (రాయలసీమ) సర్వే చేయడానికి నియమించబడ్డాడు. 1793 నుంచి 1816 వరకు మొదటి సర్వేయర్ జనరల్‌గా పనిచేసిన కాలంలో మెకంజీ 'కైఫీయత్తులు' రాయించాడు. కైఫీయత్ (Kaifiyat) అనే అరబ్బీ పదాన్ని Village Local Records అనే వ్యవహరిస్తున్నాం. వీటినే 'స్థానిక చరిత్ర'లని అంటున్నాం. కడప జిల్లా కైఫీయత్‌లలో మనకు రేనాటి చోళ రాజుల ప్రస్తావన కన్పిస్తుంది.

1947 ప్రాంతంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధకులుగా వున్న ఎం. వెంకటరామయ్య గారు రేనాటి చోళుల శాసనాలను పరిష్కరించడానికి సంకల్పించారు. శాసన పరిశోధకులైన రావు బహద్దూర్ క్రిష్ణమాచార్యులు Estampage లను తయారు చేశారు.

కలమల్లలోని చెన్నకేశవ ఆలయం వెనుక భాగంలో తొలితెలుగు శాసనాలను గుర్తించడం జరిగింది. ఇందులోని లిపి చాలా వరకు కనిపించక పాడైపోయి లభించింది. ఇది స్పష్టమైన పెద్ద అక్షరాలతో చెక్కబడి వుంది. తెలుగు భాషకి లిపికి ప్రధాన ఆధారంగా ఈ శాసనం నిలిచింది. క్రీ.శ. 6వ శతాబ్ది చివరి పాదానికి చెందిన కలమళ్ళ శాసనంలో ఎరికల్ ముతురాజు ధనుంజయుడు రేనాడును పరిపాలన చేస్తున్న కాలంలో చిఱుంబూరి (చిలమకూరు) రేవణకాలు పంపున చెనూరుకాజు కొంత భూమిని దానమిచ్చినట్లు శాసనం వేయబడింది. ఎపిగ్రాఫియా ఇండికాలో ఎం. వెంకటరామయ్య, ఆచార్య నీలకంఠశాస్త్రి గార్లు రేనాటి చోళులపైన ప్రత్యేక వ్యాసం రాశారు. కడప జిల్లాలోని ఎర్రగుడిపాడు గ్రామంలోని చెన్నకేశవస్వామి ఆలయంలోనూ కొన్ని శాసనాలను గుర్తించడం జరిగింది. ఇందులోని లిపి కూడా కలమల్ల శాసనముకు దగ్గరగానే పోలి వుండడం విశేషం. ఉరుటూరు గ్రామంలోని ఒక బావి దగ్గర బయల్పడిన శాసనం కూడా రేనాటి చోళుల కాలం నాటిదిగానే భావిస్తున్నారు.

క్రీ.శ. 550లో పరిపాలించిన సాగించిన నందివర్మ రేనాటి రాజవంశీయులలో కరికాళ చోళుడి తర్వాత ఆర్యుడుగా నిలిచాడు. దీనినిబట్టి కరికాల చోళుడ్ని ఈ వంశానికి మూల పురుషుడిగా పేర్కొనవచ్చు. నందివర్మ తర్వాత సుందరనంద రాజ్యపాలన చేశాడు. నందివర్మ మూడవ కుమారుడైన ధనుంజయవర్మ ఇరవై ఐదు సంవత్సరాల పాటూ రాజ్యాన్ని పాలించాడు. ఎఱికల్ ముత్తురాజు అనే బిరుదు ధరించి క్రీ.శ. 575-600 కాలములో పరిపాలన సాగించాడు. ధనుంజయ వర్మ కుమారుడు మహేంద్రవర్మ తర్వాత అధికారం అందుకున్నాడు. క్రీ.శ.

850లో పాలన సాగించిన శ్రీకాంత అధిరాజు పేరు ఇందుకూరు, పోట్లదుర్తి, కమలకూరు, గంగపేరూరు, ఉరుటూరు, నల్ల చెరువుపల్లి శాసనాల్లో కన్పిస్తుంది. పుణ్యకుమారుడు రెండు తామ్ర శాసనాలు వేయించాడు. పురుష శార్దూల, పోరుమ్ముఖరామ, పృథ్వీవల్లభా, గణ్యమానుడు వంటి బిరుదులు కూడా ఇతడికి వున్నాయి. 'వసన్తపోటి'ని ఇతడు వివాహం చేసుకున్నాడు. దొమ్మరినంద్యాల తామ్రశాసనం పుణ్యకుమారుడే వేయించాడు. రాణి వసంతపోటి రామేశ్వర స్తంభ శాసనాన్ని వేయించింది. ఆ దేవుడి ధూపదీప నైవేద్యాల కొరకు రెండుతోటలు, మూడు వందల మఱుత్తుల్లు భూమి దానం చేయబడింది. మాలెపాడు శాసనంలో సత్యాధిత్య చోళమహారాజు పేరు పేర్కొన్నారు.

క్రీ.శ. 725లో పాలన సాగించిన ఉత్తమాదిత్యుడి పేరు వెల్దుర్తి శాసనంలో చెప్పబడింది. విజయాదిత్యుడి గురించి జమ్మలమడుగు ప్రాంతంలోని చామలూరులో లభించిన శాసనం వెల్లడిస్తుంది. క్రీ.శ. 850లో వచ్చిన శ్రీ కంఠ అధిరాజు చోళుడు వేయించిన రెండు తామ్రశాసనాలు ఇప్పుడు మనకు కీలకమైన ఆధారాలుగా నిలుస్తున్నాయి. ఇవి మద్రాసు మ్యూజియం వారి ఆధీనంలోనే వున్నాయి.

1962లో 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళం' రచన చేసిన కందూరి ఈశ్వరదత్త రేనాడు ప్రాంతాన్ని రాయలసీమలో అంతర్భాగంగా ఇందులో కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు మండలాలు వున్నాయని విశ్లేషణాత్మకంగా వివరించారు. కర్నూలు మండలంలోని దక్షిణ భాగమైన కోయిలకుంట్ల సిరివేలు తాలూకాలను, కడప మండలంలోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల, కమలాపురం తాలూకాలను, అనంతపురం మండలంలోని దక్షిణ ప్రాంతమైన హిందూపురం తాలూకా ప్రాంతమును, చిత్తూరు మండలమునకు ఉత్తర దిక్కులో వున్న మదనపల్లి తాలూకాలోని భూభాగాలను అందులోని ప్రాంతాల పేర్లనుకూడా పేర్కొన్నారు.

# తొలి తరం తెలుగు శాసనాలు

క్రీ.శ. 575 కాలం నుంచి 850 వరకు రేనాటి చోళుల వంశవృక్షం లభిస్తోంది. ఈమధ్య కాలంలోని రాజులు వేసిన శాసనాలు మనకు స్క్రిప్ట్ రూపంలో అందుబాటులో వున్నాయి. తొలి తెలుగు శాసనం నుంచి తర్వాతి శాసనాల వరకు భాషను పరిశీలించినప్పుడు తెలుగు రాజభాషగా, శాసన భాషగా, అధికార భాషగా, పాలన భాషగా ఎలా నిర్మితం అవుతూ వస్తోందో స్పష్టమౌతుంది. తొలి తరం శాసనాలు అన్నీ రేనాటి చోళులు కాలానికి చెందినవే. వీరి 33 శిలాశాసనాలు, 4 తామ్ర శాసనాలు తెలుగు భాషా స్వరూపాన్ని ఆవిష్కరిస్తున్నాయి. ఈ శాసనాలన్నీ దాన శాసనాలే కావడం విశేషం.

ముప్పైమూడు శిలాశాసనాలు : ఇందులో మూడు కలమళ్ళ శాసనాలు కాగా రెండు శాసనాలు కల్గిన ప్రాంతాలు వెల్దుర్తి, తిప్పలూరు, మాలెపాడు, కొసినెపల్లె, ముద్దనూరు, పెద్దముడియం పేర్లతో లభించాయి. ఒక శాసనంగా బయల్పడినవి ఎర్రగుడిపాడు, ఇందుకూరు, పోట్లదుర్తి, ఉరుటూరు, నల్లచెరువుపల్లె, కమలకూరు, నాగూరు, గంగపేరూరు, కత్తెరగండ్ల, పులపత్తూరు, మిడతూరు, వేల్పుచర్ల, ప్రొద్దుటూరు ప్రాంతాల శిలాశాసనాలు వున్నాయి.

నాలుగు తామ్ర శాసనాలు : పుణ్య కుమారుని మాలేపాడు తామ్రశాసనం, పుణ్యకుమారుని దొమ్మరి నద్యాల తామ్ర శాసనం, శ్రీకంఠచోళుని మద్రాసు మ్యూజియం తామ్ర శాసనం, శ్రీ కంఠ శ్రీమనోహరుని పెద్దచెప్పలి తామ్రశాసనం.

## లేఖలు

1. సమాచార హక్కు చట్టం - పత్రం
2. చెన్నై ప్రభుత్వ ఎగ్మోర్ మ్యూజియం - లేఖ
3. భారతీయ పురాతత్త్వశాఖ - శాసన విభాగం - మైసూరు శాఖ-లేఖ
4. భారతీయ పురాతత్త్వశాఖ - హైద్రాబాదు విభాగం - మొదటి లేఖ
5. హైద్రాబాదు విభాగం - లేఖ - రెండవ పేజి
6. భారతీయ పురాతత్త్వశాఖ - హైద్రాబాదు విభాగం - రెండవ లేఖ
7. హైద్రాబాదు విభాగం - లేఖ - రెండవ పేజి
8. రాష్ట్ర పురాతత్త్వశాఖ - హైద్రాబాదు మొదటి లేఖ
9. రాష్ట్ర పురాతత్త్వశాఖ లేఖ - రెండవ పేజి
10. రాష్ట్ర పురాతత్త్వశాఖ - హైద్రాబాదు - రెండవ లేఖ

**To** **Dt: 07.01.2013**

**Commissioner of musems**
**Governament museum,**
**Pantheon road,**
**Egmore,**
**Chennai-600008,**

**Sir,**

***

**RTI ACT – 2005**

**The right to information Act: Provisions of Section 4(1) (b) of this Act.**

***

**The under signed here by require the following particulars of information.**

**Kindly arrange to furnish the kalamalla Inscription (cuddapah dist., Andhra Pradesh) as detailed below:**

1. **Kalamalla Inscriptioin (Cuddapah dist.,Andhra Pradesh)Renati chola is in archaic Telugu of 6th century A.D. it mentions (Eri)kal muturaju Dhanunjaya- Is this inscription availabie with you in your museum? if available, could you please provide us with it's detais?**
2. **How is it at present ?what protective measures you are taking to preserve it ?**
3. **Have you kept it for visitors,on display?**

**A Postal Order No.** 10F 524731 **dated** 07/01/2013 **is enclosed**

**Thanking you,**

**Yours Sincerely,**

**Dr. Vempalli Gangadhar,**
**D.No.4/432-A,**
**Vivekananda Nagar,**
**Kadapa – 516001, A.P**
**Cell.No.09440074893**
**Mail:gangadhar.vempalli@gmail.com**
**Web:www.vempalligangadhar.com**

Department of Museums

From

Thiru S. Selva Arasu, D.C.P.,
Assistant Director (Admn),
Government Museum,
Egmore,
Chennai – 600 008

To

Dr. Vempalli Gangadhar,
D.No.4/432-A,
Vivekananda Nagar,
Kadapa – 516001,
Andhra Pradesh.

Letter No.157/2013/G2, dated: 04.03.2013

Sir,

Sub: RTI ACT – 2005 – The right to information Act: Provisions of Section 4(1) (b) of this Act.

Ref: Your letter dated 07.01.2013

----

With reference to the letter cited, I am to state that the inscribed stone is not available in Government Museum, Chennai.

Yours faithfully,

Assistant Director (Admn) and
Public Information officer
Govt. Museum, Chennai-8.

4/3/13







ದೂರವಾಣಿ / दूरभाष / Telephone 0821- 2304367 (T/F) 2304140 (Dir) 2304211 (O)

ಇ–ಮೇಲ್ ई-मेल e-mail : direp2.asi@gmail.com

प्रत्नकीर्त्तिमपावृणु

ಭಾರತ ಸರ್ಕಾರ
ಪ್ರವಾಸೋದ್ಯಮ ಮತ್ತು ಸಂಸ್ಕೃತಿ ಮಂತ್ರಾಲಯ
ಸಂಸ್ಕೃತಿ ವಿಭಾಗ
ಪುರಾಲೇಖ ನಿರ್ದೇಶಕರ ಕಾರ್ಯಾಲಯ
ಭಾರತೀಯ ಪುರಾತತ್ವ ಸರ್ವೇಕ್ಷಣ
ಮೈಸೂರು – ೫೭೦ ೦೧೭

भारत सरकार
पर्यटन और संस्कृति मंत्रालय
संस्कृति विभाग
पुरालेख निदेशालय
भारतीय पुरातत्व सर्वेक्षण
मैसूर - ५७० ०१७

**Government of India**
Ministry of Tourism & Culture,
Department of Culture
**Office of the Director (Epigraphy)**
Archaeological Survey of India,
Mysore - 570 017

ಸಂಖ್ಯೆ संख्या **No.:** 91/13/3(a)/12.. 91

ದಿನಾಂಕ दिनांक **Date:** 18/04/13

To

Dr. Vempalli Gangadhar,
D.No.4/432-A,
Vivekananda Nagar,
KADAPA – 516 001 (A.P.)

Sir,

With reference to your application under RTI, the following available information is furnished for your reference.

1. The Kalamalla stone inscription is copied by this office in 1904 which is noticed in the *Annual Report on Indian Epigraphy* as No.A.380. An article is also published on the said inscription in Epigraphia Indica Vol.XXVII as article no.42.
2. The main work of the Epigraphy Branch of ASI is to conduct epigraphical survey and copy inscriptions available in different parts of the country and report them in its Annual Report on Indian Epigraphy. This office is not collecting and/or preserving inscriptions on stones, copper plates or coins. Hence, informing about the question of its present status does not arise.
3. The Estampage (copy of the inscription taken on paper by manual process) is available in this office and photo of the said estampage is displayed in the gallery of this office with proper labeling for information of the general public.

Yours faithfully,

(T S RAVISHANKAR)
Director (Epigraphy)I/c

ಪುರಾತತ್ವ ಭವನ, ಸಂಕ್ರಾಂತಿ ವೃತ್ತ, ಹೆಬ್ಬಾಳ್ ೨ನೇ ಹಂತ, ಮೈಸೂರು – ೫೭೦ ೦೧೭
पुरातत्व भवन, संक्रांति सर्कल, हेब्बाल २ स्टेज, मैसूर - ५७० ०१७
"Puratatva Bhavan", Sankranthi Circle, Hebbal 2nd Stage, MYSORE - 570 017




भारत सरकार
**GOVERNMENT OF INDIA**
భారత ప్రభుత్వము




ఉప పురాతత్వ అధీక్షకులు,
భారతీయ పురాతత్వ సర్వేక్షణ
హైదరాబాదు మండలము
3వ అంతస్తు, కేంద్రీయ సదనము,
సుల్తాను బజారు, హైదరాబాదు - ౫౦౦ ౦౯౫

उप अधीक्षक पुरातत्वविद
भारतीय पुरातत्व सर्वेक्षण
हैदराबाद मंडल
तीसरी मंजिल, केंद्रीय सदन,
सुल्तान बाजार, हैदराबाद - ५०० ०९५.

Deputy Superintending Archaeologist
Archaeological Survey of India,
Hyderabad Circle, IIIrd Floor,,
Kendriya Sadan, Sultan Bazar,
Hyderabad - 500 095.
✆ : 24658124 Fax : 040-24651012
E-mail : circlehyd.asi@gmail.com

సంఖ్య / सं / No. : RTI/2012-13/2393 తేది / दिनांक / Date : 7-12-2012




డా॥ వేంపల్లి గంగాధర్,
4/432-A,
వివేకానంద నగర్
కడప - 516 001

విషయం: సమాచార హక్కు చట్టం - 2005 ద్వారా సమాచారం ఇవ్వడం గురించి.
మీ లేఖ తేదీ 30-10-2012

అయ్యా!

సమాచార హక్కు చట్టం - 2005 ద్వారా మీ లేఖలో కోరిన విధంగా కడప జిల్లాలో బయల్పడిన ~~శాసనాన్ని~~ కలమళ్ళ శిలా శాసనాన్ని గురించి వివరాలను క్రింద పొందుపరచాము. పరిశీలించగలరు.

① కడప జిల్లాలో బయలుపడిన 'కలమళ్ళ శాసనం' (క్రీ.శ. 575 నాటి రేనాటి చోళరాజు ధనంజయ వర్మ వేయించినది) ప్రస్తుతం ఎక్కడ వుంది? ఏదైనా మ్యూజియంలో ఉన్నచో ఆ వివరాలు తెలుపగలరు?

రేనాటి చోళరాజు ధనంజయుడు వేయించిన కలమళ్ళ శిలాశాసనం కడప జిల్లాలోని కలమళ్ళ గ్రామంలోగల శ్రీ చెన్నకేశవస్వామి ఆలయ ప్రాంగణంలో వున్నట్లుగా 1904 సం॥ నందు మద్రాసు నందలి శాసన పరిశోధన విభాగం వారు గుర్తించారు. ప్రస్తుతం ఎక్కడ వున్నదో తెలియదు.

పేజీ తిప్పి చూడండి...

②

② కలమళ్ళ ~~[illegible]~~ శాసనం యొక్క పొడవు, వెడల్పు, ఆకారం, బరువు వంటి సాంకేతిక వివరాలు తెలుప గలరు!

కలమళ్ళ శాసనం యొక్క పొడవు, వెడల్పు, ఆకారం, బరువు వంటి సాంకేతిక వివరాలు లభించుట లేదు.

③ కలమళ్ళ శాసనాన్ని మొదటిసారిగా ఎవరు, ఎప్పుడు, ఎక్కడ గుర్తించారు? తరువాత ఎక్కడికి తరలించారు? ప్రస్తుతం అది ఎక్కడ వుంది?

కలమళ్ళ శాసనాన్ని తొలిసారిగా 1904 సం॥లో నాటి మద్రాసు ప్రభుత్వ శాఖ వారు కడప జిల్లా కలమళ్ళ గ్రామంలో వెలిసి వున్న శ్రీ చెన్నకేశవ స్వామి వారి ఆలయప్రాంగణంలో వున్నట్లుగా గుర్తించారు. తరువాత 1947-48 సం॥లో ఆచార్య కె. నీలకంఠ శాస్త్రి, శ్రీ యమ్. వెంకట రామయ్య గార్లు ఈ శాసనాన్ని పరిష్కరించి ప్రచురించారు. ఇంతకు మించి ఏ సమాచారం అందుబాటులో లేదు!

కృతజ్ఞతలతో

భవదీయుడు

అడ్డూరి కన్నబాబు

3/12/12

కేంద్ర పౌర సమాచార అధికారి




ఉప పురాతత్వ అధీక్షకులు,
భారతీయ పురాతత్వ సర్వేక్షణ
హైదరాబాదు మండలము
3వ అంతస్తు, కేంద్రీయ సదనము,
సుల్తాను బజారు, హైదరాబాదు - ౫౦౦ ౦౯౫

भारत सरकार
GOVERNMENT OF INDIA
భారత ప్రభుత్వము

उप अधीक्षक पुरातत्वविद
भारतीय पुरातत्व सर्वेक्षण
हैदराबाद मंडल
तीसरी मंजिल, केंद्रीय सदन,
सुल्तान बाजार, हैदराबाद - ५०० ०९५.




Deputy Superintending Archaeologist
Archaeological Survey of India,
Hyderabad Circle, IIIrd Floor,,
Kendriya Sadan, Sultan Bazar,
Hyderabad - 500 095.
✆: 24658124 Fax: 040-24651012
E-mail: circlehyd.asi@gmail.com

సంఖ్య / सं / No.: RTI/2012-13/2392 తేది / दिनांक / Date: 7-12-2012




డా॥ వేంపల్లి గంగాధర్,
4/432-A
వివేకానంద నగర్,
కడప - 516 001

విషయం: సమాచార హక్కు చట్టం - 2005 ద్వారా సమాచారం ఇవ్వడం-గురించి
మీ లేఖ తేదీ 30-10-2012.

అయ్యా! సమాచార హక్కు చట్టం - 2005 ద్వారా మీ లేఖలో కోరిన విధంగా రేనాటి చోళులు - చరిత్ర, కలమళ్ళ శిలా శాసనమునకు సంబంధించిన వివరములను క్రింద పొందు పరచాము. పరిశీలించ గలరు!

① రేనాటి చోళులు - వారి సమగ్ర చరిత్ర, వంశక్రమము, పరిపాలన, నాటి ఆర్థిక రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అంశాలకు సంబంధించి పూర్తి వివరాలు తెలియపరచగలరు?

పై అంశాలకు సంబంధించి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర - సంస్కృతి - III - తొలి మధ్యయుగ ఆంధ్రప్రదేశ్ పుస్తకం నుండి శ్రీ పి. భాస్కరరెడ్డి గారు వ్రాసిన వ్యాసాన్ని ఈ లేఖతో జత పరచాము.

- పేజీ తిప్పి చూడండి

② తొలి తెలుగు శాసనంగా చెప్పబడుతున్న కడప జిల్లాలోని కలమళ్ళ శాసనం (రేనాటి చోళరాజు ధనంజయ వర్మ) వేయించినది - దీనిని ASI వారు తొలి తెలుగు శాసనంగా అంగీకరిస్తున్నారా? అంగీకరిస్తే ఆధారాలు తెలుపగలరు!

రేనాటి చోళరాజు ధనంజయుడు వేయించిన కలమళ్ళ శిలా శాసనాన్ని తొలి తెలుగు శాసనంగా ప్రసిద్ధ శాసన పరిశోధకులు సహేతుకంగా నిర్ణయించారు కావున మేము కూడా వారి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నాము. నేటికి లభించిన తొలి తెలుగు శాసనములలో కలమళ్ళ శాసనమే ప్రప్రథమమనటానికి అందులో వాడిన ప్రాచీన లిపి - భాషలే ప్రమాణం. ఎరికల్ ముత్తరాజు వేయించిన ఎర్రగుడిపాడు శాసనం, పుణ్యకుమారుని తిప్పలూరు శాసనాలు తరువాత క్రమంలో వచ్చి చేరుతాయి.

ఇంకా ఏమైనా ప్రాచీన తెలుగు శాసనాలు వెలుగులోనికి వస్తాయేమో వేచి చూద్దాం! చరిత్ర పరిశోధకుడు ఆశాజీవి!

విజ్ఞానదాయకమైన మంచి ప్రశ్నలు అడిగారు.

కృతజ్ఞతలతో
భవదీయుడు
చిట్టకవి కన్నబాబు
3/12/12
కేంద్ర పౌర సమాచార అధికారి.

రిజిష్టరు పోస్టు ద్వారా

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

నుండి
పౌరసమాచారాధికారి,
రాష్ట్ర పురావస్తు & ప్రదర్శనశాలల శాఖ,
గన్‌ఫౌండ్రి,
హైదరాబాద్ - 500 001.
ఫోన్: 040-2323 4942.

కి
డా॥ వేంపల్లి గంగాధర్,
4/432-ఎ, వివేకానందనగర్,
కడప - 516001.

లేఖ నెం. హెచ్.1/881/2013, తేది: 06-05-2013

అయ్యా!

విషయము : సమాచార హక్కు చట్టం, 2005 - కడప జిల్లాలో బయల్పడిన 'కలమళ్ళ శాసనం' యొక్క వివరములు - గురించి.
నిర్దేశము : డా॥ వేంపల్లి గంగాధర్, కడప వారి లేఖ తేది09-04-2013.

- - -

సమాచార హక్కు చట్టం, 2005 ప్రకారం, మీరు నిర్దేశము ద్వారా కోరిన సమాచారమును ఈ దిగువన తెలుపడమైనది.

| ప్రశ్న | జవాబు |
|---|---|
| 1. కడప జిల్లాలో బయల్పడిన 'కలమళ్ళ శాసనం' (క్రీ.శ.575 నాటి రేనాటి చోళరాజు ధనుంజయ వర్మ వేయించినది) ప్రస్తుతం ఎక్కడ వుంది? శాసనం పొడవు, వెడల్పు, ఆకారం వివరాలు తెల్పండి? | 1. కడప జిల్లాలో బయల్పడిన కలమళ్ళ శాసనం ప్రస్తుతం ఎక్కడ వున్నది ఖచ్చితంగా తెలియకున్నది. (1967లో పురావస్తు శాఖ వారు ఈ శాసన నకల్లును కలమళ్ళ గ్రామంలోనే తీసుకొని రావడం జరిగింది). ఈ శాసనం పొడవు 42 అంగుళాలు, వెడల్పు 9 అంగుళాలు కలిగి వున్నట్లు శాసన నకలు ద్వారా తెలియుచున్నది. ఈ శాసనము పై భాగములో వెడల్పు తక్కువగా వున్నది |
| 2. కలమళ్ళ శాసనాన్ని మీ శాఖ తొలి తెలుగు శాసనంగా అంగీకరిస్తున్నదా? ఆధారాలు తెలుప గలరు? | 2. రాష్ట్ర పురావస్తు శాఖ వారు కలమళ్ళ శాసనాన్ని ఆంధ్రుల తొలి తెలుగు శాసనంగా అంగీకరించినట్లు కడప జిల్లా శాసనాల పుస్తకంలోని 'హిస్టారికల్ ఇన్ట్రడక్షన్' లోని 'ది రేనాటి చోళాస్' అనబడే మొదటి ఛాప్టర్‌లో అనగా పేజి 14 (XIV) రెండవ [illegible] లైనులో నిర్ధారించబడియున్నది. |

3. రేనాటి చోళులు - వారి సమగ్ర చరిత్ర, వంశ క్రమము, పరిపాలన, నాటి ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక అంశాలకు సంబంధించిన వివరాలు అందజేయగలరు?

3. చరిత్ర సంస్కృతికి సంబంధించిన పత్రములు పంపుచున్నాము. చదువుకొని తెలుసుకొనగలరు.

4. కలమళ్ళ శాసనాన్ని మొదటిసారిగా ఎవరు ఎప్పుడు గుర్తించారు? తర్వాత ఎక్కడికి తరలించారు? ప్రస్తుతం దాని పరిస్థితి ఏమిటి?

4. కలమళ్ళ శాసనాన్ని మొదటిసారిగా 1967లో రాష్ట్ర పురావస్తుశాఖ వారు నిర్వహించిన కడప జిల్లా శాసనాల సర్వేలో శ్రీ జి. జవహర్‌లాల్, అసిస్టెంట్ ఇన్ ఎపిగ్రఫి వారు కనుగొని కాపీ చేయించడం జరిగింది. తదుపరి శాసనం శిల ఎవరు ఎక్కడికి తరలించారో తెలియకున్నది. దినపత్రికలో వచ్చిన సమాచారం మేరకు చెన్నై ప్రభుత్వానికి లేఖ వ్రాసి పరిశీలించవలసినదిగా కోరనున్నాము.

జతపర్చబడినవి:
రేనాటి చోళుల చరిత్ర

భవదీయులు

డా వెంకటరత్నం
పౌర సమాచారాధికారి

6/5/13

ప్రతి:
'బి' సెక్షన్ వారికి

BY RPAD

Government of Andhra Pradesh

From

The Public Information Officer,
Department of Archaeology & Museums,
Gunfoundry,
Hyderabad.
Telefax: 040-23234942

To

Dr.Vempalli Gangadhar,
D.No.4/432-A,
Vivekananda Nagar,
Kadapa-516001, A.P.
Cell No: 09440074893

Rc.No. H1/882/2013, dt:6 - 5-2013

Sir,

Sub: RTI Act – Information – Furnishing – Regarding.

Ref: Your letter RTI Act dated: 01-02-2013.

* * * *

With reference to your RTI application cited, I herewith furnish the following information under RTI Act,2005.

1 Kalamalla Inscription Stone slab is not available in the department.

2 When it is not present in our department, there is no question of the taking protective measures.

3 No

Yours faithfully,

Encl: Information of the Renati Cholas

Public Information Officer
6/5/13

Copy to B-Section

# రేనాటి చోళులు - పూర్వ రంగం

రేనాటి చోళులు మొదట పల్లవుల క్రిందను సామంతులుగా ఉండి ఉండవచ్చునని ఒక అభిప్రాయం.

పల్లవ మహేంద్ర వర్మకాలములో పుణ్యకుమారుడు స్వతంత్ర ప్రతిపత్తితో రేనాడులోని ఏడువేల రాజ్యాలను పాలించినట్లు అతని తామ్రశాసనాలు, రామేశ్వర శిలా శాసనాలు సూచిస్తున్నాయి. ఈ రాజులు తమను కరికాలాన్వయమునకు చెందిన వారుగా చెప్పుకొనుట వల్ల, కొందరు రాజులు పేర్లు చోళరాజులని ఉండుట వల్లనూ వీరు కావేరీతీరంలోగల ఆదిచోళ వంశమునకు చెందినవారని మరొక అభిప్రాయం. వీరిలో మనకు తెలుస్తున్న ధనుంజయ వర్మకు పూర్వమే వీరు తెలుగు ప్రాంతానికి వలసవచ్చి వుండొచ్చు. తెలుగువారిలో కలిసి తెలుగుభాషనే మాతృభాషగా స్వీకరించి వుండొచ్చునని అనుకోవచ్చు. వీరు తమ శిలాశాసనాలను మొదటి నుంచి కూడా తెలుగులోనే రాయించడాన్ని బట్టి ఈ విషయం విశధమౌతోంది. సాధారణంగా రాజులు తమ మాతృభాషలోనే శాసనాలను చెక్కిస్తారు. అట్లా కాకుంటే సంస్కృతంలో రాయిస్తారు. వీరు ఎప్పుడు, ఏ కోణం వల్ల ద్రవిడ దేశాన్ని వదిలేసి యిక్కడికి వచ్చారో నిర్దిష్టంగా తెలియడం లేదు.

'ఎప్పుడు, ఎలా రేనాటి చోళులు తాము రాయలసీమ భూభాగానికి అధిపతులయ్యారో తెల్సుకోవాల్సి వుంది. వారు తమను చోళులుగా, ఒరయూరుపుర ప్రభువులుగా పిల్చుకొంటారు. ఒరయూరు తొలి చోళుల రాజధాని. సుమారు క్రీ.శ. రెండవ శతాబ్దానికి చెందిన ప్రఖ్యాత పురుషుడు కరికాళుడు తమ పూర్వీకుడని వీళ్ళు చెప్పుకొంటారు. అందువల్ల వాళ్ళు కావేరీ ప్రాంతం నుంచి తెలుగు ప్రాంతానికి వలస వచ్చారని భావించవచ్చు. క్రీ.శ. ఐదో శతాబ్దం ఉత్తరార్థంలో ఎప్పుడో కావేరీ లోయ కళభ్రుల

ఆక్రమణలో ఉండగా ఒక చోళ శాఖ తెలుగు ప్రాంతానికి వలస వచ్చారని కె. ఎ. నీలకంఠశాస్త్రి, ఎమ్. వెంకటరామయ్య (WS XXVII : 220) భావించారు.

పల్లవులు - చాళుక్యుల మధ్య జరిగిన యుద్ధాలలో ముడియం (జమ్మలమడుగు - పెద్దముడియం) గ్రామం దగ్గర జరిగిన యుద్ధంలో 'ఔధ్' నుండి వచ్చిన విజయాదిత్యుడు త్రిలోచన పల్లవుని ఓడిస్తాడు. ఐనప్పటికీ యుద్ధంలో మరణిస్తాడు. గర్భవతిగా వున్న విజయాదిత్యుని భార్య పెద్ద ముడియం గ్రామంలో ఒక బ్రాహ్మణుని ఇంట పెరిగి పుత్రుడ్ని కనీ పెంచి పెద్ద చేసిందని, అతడే విష్ణువర్ధనుడని చరిత్ర ఆధారాలు చెప్తున్నాయి. చోళులలోని నాలుగు తరాలవారు ఈ ప్రాంతాన్ని (కడప) పాలించారని వెల్లడిస్తున్నాయి. విజయాదిత్య - సత్యశ్రేయ హిందూ రాజుగా వుండి, జైనక్షేత్రాలను, విద్యాలయాలను పోషించాడని తెలుస్తోంది. రెండవ కృతివర్మ మరణంతో బాదామీ చాళుక్యుల పాలన ప్రారంభమైంది. కరికాల చోళుడు త్రిలోచన పల్లవుని ఓడించి, చోళ రాజ్యాన్ని కడప జిల్లాకు వ్యాపిపంజేశాడని, ఇతని కాలంలో పలు ప్రజాహిత కార్యక్రమాలు జరిగాయని కడప జిల్లా కైఫీయత్తుల్లో చెప్పబడింది.

అతని తర్వాత అతని సంతతికి చెందిన రేనాడు చోళులు (వీరినే తెలుగుచోళులు అనికూడా అంటారు) ఈ ప్రాంతాన్ని పాలించినారు. క్రీ.శ. 610లో ఆంధ్రచోళులు గొప్ప సేనలతో దండయాత్ర జరిపి కడప, కందనోలు (కర్నూలు), అనంతపురాలను ఆక్రమించుకొన్నారు. రేనాటి చోళ రాజైన పుణ్యకుమారుడు ప్రాచీన కడప జిల్లా చరిత్రలో చెప్పుకోదగ్గరాజు. ఇతడినే 'హిరణ్యరాష్ట్ర ప్రభువు'గా దొమ్మర నంద్యాల శిలాఫలకాల్లో వర్ణించబడింది.

రేనాటి చోళరాజైన సత్యాదిత్యుడు 'రేనాడునూ, సిద్ధవటం (సిద్ధి)నూ, చోలమహరాణి 'చిలమకూరు' నుండి పాలించినట్లు లేబాక, అత్తిరాల ప్రాంతాలను శ్రీకాంత చోళుడు పాలించినట్లు మాలేపాడు శాసనం, మరికొన్ని ఇతర శాసనాలు ధృవపరుస్తున్నాయి.

రేనాటి చోళరాజులు తాము శంగం (సంశం) యుగం (క్రీ.శ. ఒకటి, రెండు మూడు శతాబ్దాలు)లో ద్రావిడ మండలాన్ని పాలించిన కరికాలుని వంశానికి చెందినవారుగ చెప్పుకొన్నారు. కొందరి రాజులపేర్లు చోళమహారాజులవి ఉండడం చేత వీరు కావేరీతీరంలో ఉన్న మూల చోళవంశానికి చెందినవారని తెలుస్తోంది. వీరు ఏకారణంవలన ఎప్పుడు ద్రావిడదేశాన్ని వదలి ఇక్కడికి వచ్చారో తెలియదు. కరికాలచోళుడను చోళచక్రవర్తి త్రిలోచన పల్లవుడనే పల్లవరాజును జయించినట్లు కొన్ని తెలుగుదేశశాసనాలు చెప్తున్నాయి. కానీ కరికాలచోళుడు, త్రిలోచన పల్లవుడు చరిత్రకు పూర్తిగా అందని వ్యక్తులు. అయినా, ఒకచోళరాజు, ఒకానొక ప్రాచీన పల్లవరాజును జయించి తెలుగుదేశంలో వారి సంతతి వారిని పాలకులుగా నిలిపినాడని అనుకోవచ్చును. ఇలా తెలుగుదేశంలో స్థిరపడిన ఈ చోళులు తెలుగువారితో పూర్తిగా కలిసిపోయి, తెలుగుభాషనే మాతృభాషగా స్వీకరించారు. ఈ విషయం వారు తమ శిలాశాసనాలను మొదటి నుండి తెలుగులోనే రాయించడాన్ని బట్టి రుజువవుతుంది.

## రేనాడు

రేగడినేల ఉన్న ప్రాంతంకాబట్టి రేగడినాడు తర్వాత 'రేనాడు'గా మారిండవచ్చునని చరిత్ర పరిశోధకుడు పుట్టపర్తి శ్రీనివాసాచారి అభిప్రాయపడ్డారు. దీనిని ఖండిస్తూ రేనాడు అనే పదంలోని 'రే' రేడు (రాజు)ను సూచిస్తుందని ఆచార్య నీలకంఠశాస్త్రి, ముట్లూరి వెంకట రామయ్య గారు వ్యక్తీకరించారు. దీనికి కారణంగా క్రీ.శ. 10వ శతాబ్దానికి ముందు, 'మహారాజపాడి' అనే ప్రాంతాన్ని శాసనాల్లో చూపించారు. రేనాడుగా వ్యవహరించిన ప్రాంతాన్నే ఆ తర్వాత 'మహారాజపాడి' అని పిలిచేవారని, దీనికే 'మార్జావాడ' అనే మరొక పేరుందని ఈ శాసనాలను పరిశీలించిన ఈశ్వరదత్తుగారు 'మార్జావాడ రాజ్యము నేటి కడప, చిత్తూరు మండలములను దాటి మైసూరు రాష్ట్రములోని కోలారు మండలం వరకు వ్యాపించి వున్నదని స్పష్టపర్చారు.

కడప జిల్లాలోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల, కమలాపురం తాలూకాలు, కర్నూలు జిల్లాలోని దక్షిణ భాగమైన కోయిలకుంట్ల, సిరివేలు తాలూకాలు, అనంతపురం జిల్లాలోని దక్షిణ ప్రాంతమైన హిందూపురం తాలూకాలు, చిత్తూరు జిల్లాలో ఉత్తర దిక్కున కడప జిల్లాకు సమీపంగా వున్న మదనపల్లి తాలూకా ప్రాంతాలు నాటి రేనాడులో భాగంగా వున్నట్లు చరిత్ర పరిశోధకుడు ఈశ్వరదత్తు అభిప్రాయపడ్డారు.

క్రీ.శ. 6వ శతాబ్దినాటికి కడప జిల్లాలోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల, కమలాపురం తాలూకాలు, కర్నూలు జిల్లాలోని దక్షిణ భాగమైన కోయిలకుంట్ల, సిరివెళ్ళ తాలూకాలు, అనంతపురం జిల్లాలోని హిందూపురం తాలూకా ప్రాంతం, చిత్తూరు జిల్లాలోని మదనపల్లె తాలూకా ప్రాంతాలను కలిపి 'రేనాడు' అని పిలిచేవారు. ఇది ఏడువేల గ్రామాల మండలం. దీనిని కరికాళచోళ సంతతికి చెందిన బాదామి చాళుక్యరాజుల మూలపురుషుడైన చలికి రెమ్మణకుని వంశస్థులైన చోళరాజులు పాలించేవారు. కాబట్టి వీరికి 'రేనాటి చోళులు' అని పేరొచ్చింది. ఆనాటి భాషా స్వరూపాన్ని ఇప్పటి దాకా నిలబెట్టిన ఘనత వీరికి దక్కుతుంది. కానీ వీరి చరిత్ర మనకు సమగ్రంగా లభించడం లేదు. అందులోనూ అక్షరాల 'పుణ్యకుమారుడి' గురించి పట్టుమని పది వాక్యాలు వరుసగా మన అధికారిక చారిత్రక పుస్తకాల్లో కనపడవు. సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. చరిత్రకారులు నీలకంఠ శాస్త్రి, వెంకట్రామయ్య, హెచ్. కృష్ణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరి వెంకటరమణయ్య వారు 'రేనాటి చోళుల' గురించి సమాచారం అందించారు.

రేనాటి చోళులు మొదట పల్లవులు, తర్వాత బాదామి చాళుక్యుల సామంతులుగా వున్నట్లు తెలుస్తోంది. అయినప్పటికీ పల్లవ మహేంద్ర వర్మ కాలము నందు పుణ్యకుమారుడు స్వతంత్ర ప్రతిపత్తితో ఏడువేల రేనాటి రాజ్యమును పాలించినట్లు అతడు వేయించిన తామ్ర శాసనాలు,

ప్రొద్దుటూరు రామేశ్వరం శిలా శాసనాలు సూచిస్తున్నాయి. కమలాపురం తాలూకా లోని కలమళ్ళ గ్రామంలో ధనుంజయవర్మ వేయించిన శిలాశాసనం ఆ వంశం వారికే కాక, తెలుగు భాషకే మొదటి వాక్య రచనగా తొలి తెలుగు శాసనముగా గుర్తించబడింది. దీని లిపిని బట్టి ఆరవ శతాబ్దం రెండవ సగభాగం నాటిదని చరిత్రకారుల అభిప్రాయం. మొదట లభించిన శాసనం ఒకటి మద్రాసు మ్యూజియంకు తరలిపోయింది అని భావిస్తూ వచ్చారు. ఆ శాసనము పగిలిపోయి లభించింది. ఉన్న భాగములో 'ఎరికల్ముతు రాజు ధనుంజయుడు రేనాణ్ణు ఏళన్' అను ఒక వాక్యభాగము పూర్తి అర్థాన్ని ఇస్తోంది. తర్వాత 'చిఱుంబూరి రేవణకాలు పంపు చెనకారు రాజ అటికాళా ఊరిణ్ణవారు ఊరి...' అనే అసంపూర్తి వాక్యము. చివరిలో 'పఞ్చమహా పాతక సంయుక్త రగున్' అనే వాక్యం కలదు. రేనాటి చోళరాజులలో కొందరికి 'ఎరికల్ ముతురాజు' 'దుగరాజు' అనే బిరుదులు కనిపిస్తున్నాయి.

ఈ శాసనం ప్రకారం ఎరికల్ ముత్తురాజు ప్రోత్సహంతో దానమిచ్చినట్లు తెలుస్తోంది. చిరంబూరు నేటి యర్రగుంట్ల దగ్గరి చిలంకూరుగా గుర్తించినారు. రేనాటిచోళుల శాసనాల వలన ఆనాడు సూర్యుడిని ఆరాధించేవారని తెలుస్తోంది. దేవాలయాల్లో ఆదిత్య విగ్రహం నిలపడం వుండేది. దేవాలయాలలో దీపాల కోసం నూనె గానుగలను దానం చేసేవారు. రేనాటి చోళుల కాలంలో కూడా దేవాలయాల సొత్తును కైంకర్యం చేసేవారు వుండేవారు. 'దేవ స్వంబులఞ్చంబు, గొణ్ణవాన్డు వారనాశి వ్రచ్చిన పాపంబు గొణ్ణవాన్డు' అని ఒక శాసనంలో వుంది. అంటే దేవుడి సొత్తులంచం తిన్నవాండ్లు కాశీలో చంపిన పాపం మూటకట్టుకున్న వాళ్ళు' అని అర్థం. 'ఎంత మేనియు ఔగొన్నవాన్డు, ఇచ్చిన వాన్డు చెడువాన్డు' అని మరొకశాసనంలో వుంది. అంటే 'ఎంతమాత్రం లంచం యిచ్చినా, పుచ్చుకున్నా నాశనమవుతారు' అని అర్థం. ఆనాడు శాస్త్రీయ జ్యోతిష్య పంచాంగం కూడా వుండేదని రేనాటి చోళుల శాసనాల వలన తెలుస్తోంది. 'కొండ కార్తియ చీకున విదియ సోమవారమ్బు పుణరు పుష్యమ్బు బృహస్పతి హోరకాను' అని తిథి వార నక్షత్రాలను కూడా పేర్కొన్నారు.

ప్రస్తుతం ఆంధ్ర ప్రదేశ్‌లోని కడప జిల్లాలోని అధిక భాగం, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాలోని కొన్ని భాగాలు, కర్నాటకలోని కోలారు జిల్లా కలిపి సుమారుగా రేనాడు ప్రాంతం అవుతుంది (EI Vol. XXVII : Page 225) ఈ భూభాగంలో ఆంధ్రదేశంలోని ఏడువేల గ్రామాలు (శిస్తు విభాగాలు), ఈ ప్రాంతాన్ని నల్లరేగడి దేశంగా, కుందేరు నదిలోయ ప్రాంతంగా చరిత్ర పరిశోధకులు జె. రామయ్య పంతులు గుర్తించారు.

రేనాటి ప్రాంతాన్ని ప్రాచీన కాలంలో 'మహారాజవాడి' లేదా 'మార్జువాడి' అని పిలిచేవారు. క్రీ.శ. 6వ శతాబ్దం నుండి 9వ శతాబ్దం వరకు చోళ వంశమునకు చెందిన రాజవంశము రేనాటి ప్రాంతాన్ని పాలించి క్రమంగా విడిపోయి ఎరువ, పొత్తపి, నెల్లూరు, కొణిదెస, నిడుగల్లు, కందూరు అనే చోళ వంశాలు ఏర్పడ్డాయి. క్రీ.వ. 645లో చైనా యాత్రికుడు హ్యూయాన్ త్సాంగ్ ఈ ప్రాంతాన్ని పర్యటించాడు. దీనిని 'చుళియ' దేశంగా వర్ణించాడు.

రేనాడు రాజ్యం మొదట 7,000 గ్రామాదాయ పరిమితి గల దేశముగా శాసనాల్లో చెప్పబడింది. కానీ 16వ శతాబ్దినాటికి ఉదయగిరి, పెనుగొండ దుర్గముల మధ్య భూభాగాలను ఆక్రమించి మార్జువాడి రెండు భాగాలుగా విడిపోయింది.

రేనాటి చోళుల చరిత్ర తెలుసుకోవడానికి నాలుగు తామ్రశాసనాలు, శిలాశాసనాలు ఆధారాలుగా లభించాయి. తోకను వీపుపైన చుట్టత్రిప్పి ఎడమవైపు నిలుచున్న పరాక్రమ సింహము రేనాటి చోళుల రాజలాంఛనముగా గుర్తించారు. పుణ్యకుమారుడి తిప్పలూరు శాసనములో 'చెప్పలియ' అనగా నేటి 'పెద్ద చెప్పలి' రాజధానిగా వున్నట్లు తెలుస్తోంది. ఈ గ్రామ పరిసర ప్రాంతాల్లో రేనాటి చోళుల తామ్రశాసనాలు, శిలాశాసనాలు అనేకం లభించాయి. మాలెపాడు - దొమ్మరినంద్యాలలో దొరికిన రెండు తామ్రశాసనాల వలన కరికాలుడి వంవములో నందివర్మ జన్మించినట్లు, అతనికి పుట్టిన సింహవిష్ణువు, సుందర నందుడు, ధనుంజయవర్మ అనే ముగ్గురు కుమారులలో ధనుంజయవర్మకు

మహేంద్రవిక్రముడు, అతనికి గుణముదితుడు, పుణ్యకుమారుడు జన్మించినట్లు తెలుస్తోంది. పుణ్యకుమారుడు 'హిరణ్యారాష్ట్రము'ను పాలించినట్లు వివరణ. పుణ్యకుమారుడి తర్వాత అతని కుమారుడు విక్రమాదిత్యుడు, శక్తి కుమారుడు, రెండవ విక్రమాదిత్యుడు (ఛోళ మహారాజు), ఉత్తమాదిత్యుడు, సత్యాదిత్యుడు, విజయాదిత్య చోళుడు రాజ్యాధికారం చేసినట్లు శాసనాల వల్ల తెలుస్తోంది. పై ఆధారముల వలన రేనాటి చోళులు క్రీ.శ. 550 నుండి క్రీ.శ. 850 వరకు సుమారు 300 సంవత్సరాలు రాజ్యపాలన చేసినట్లు తెలుస్తోంది.

## రాజధాని

రేనాటి చోళులు 'చెప్పలియా' గ్రామం రాజధానిగా రేనాటి ప్రాంతాన్ని పాలించినట్లు చరిత్ర చెప్తోంది. ఇది కడపజిల్లా కమలాపురం తాలూకాలోని 'పెద్ద చెప్పలి'గా చరిత్రకారులు గుర్తించారు. రేనాటి చోళరాజులలో ముఖ్యుడైన పుణ్యకుమారుడి తిప్పలూరు శాసనంలో 'చెప్పఁలియ' పేరు కన్పిస్తుంది. మొదట దీనిని మనదపల్లి (చిత్తూరు జిల్లా) మదనపల్లి తాలూకాలోని 'చిప్పిలి' అనే గ్రామమని అపోహపడ్డారు. తర్వాత్తర్వాత కడపజిల్లా 'పెద్ద చెప్పలి' నందు చారిత్రక ఆధారాలు అనేకం బయట పడడంతో ఆ వాదన నిలబడలేదు. ఈ ప్రాంతంలో అనేక శిలాశాసనాలతో పాటూ, తామ్రశాసనాలు కూడా లభించాయి. శ్రీకంఠ చోళుని 'పెద్ద చెప్పలి' తామ్రపత్రాలు వెలుగులోకి రావడంతో చరిత్ర పరిశోధకులు పి.వి. పరబ్రహ్మశాస్త్రి కడప జిల్లా, కమలాపురం, మండలంలోని పెద్ద చెప్పలే రేనాటి చోళుల రాజధానిగా ధృవీకరించారు. (EA IV : 13, జి. కమలాకర్ 2004:11) ఇప్పటికీ పెద్ద చెప్పలిలో ఆనాటి చారిత్రిక ఆధారాలు కన్పిస్తుండడం విశేషం.

## రాజవంశం

మాలెపాడు, దొమ్మరి నంద్యాలలో దొరికిన రెండు తామ్రశాసనాలు కరికాలుడి వంశంలో నందివర్మ జన్మించినట్లు చెప్తున్నాయి. అతడికి పుట్టిన సింహవిష్ణువు, సుందరనందుడు, ధనుంజయవర్మ అనే ముగ్గురు

కుమారులలో చివరి వానికి మహేంద్ర విక్రముడు, అతడికి గుణముదితుడు, పుణ్యకుమారుడు అనే ఇద్దరు పుత్రులు జన్మించారు. పుణ్యకుమారుడు తన ఐదవ, పదవ రాజవర్షముల యందు వరుసగా పై రెండు రాగిశాసనాలు చెక్కించినట్లు తెలుస్తోంది. వీటిలోనే పుణ్యకుమారుడు 'హిరణ్యరాష్ట్రము'ను పరిపాలిస్తున్నట్లు కూడా చెప్పబడింది. మిగిలినరెండు తామ్రశాసనాల్లోనూ కరికాలుడి వంశంలో నందివర్మ, అతనికి సుందరనందుడు, నవరాముడు, ఎఱెయమ్మ, విజయకాముడు, వీరార్జునుడు, అగ్రణి పిడుగు, కోకిలి, మహేంద్రవర్మ, ఎళంజోళుడు, నృపకాయుడు, దివాకరుడు, శ్రీకంఠ చోళుడు వారు వారసులుగా జన్మించారు. ఇందులో పెద్ద చెప్పలి శాసనంలో దివాకరుడు పేరు పేర్కొనబడలేదు. నృపకాయుడికి శ్రీకంఠ మనోహరుడు జన్మించెనని రాయబడింది.

ఈ కొంచెం తేడా తప్ప మిగిలిన రెండిట్లలోనూ ఒకే రకమైన వంశ పట్టికా క్రమము కన్పిస్తుంది. ఈ ఆధారంగా సుందర నందుడి వంశములో శ్రీకంఠరాజును, ధనుంజయ వర్మ వంశములో పుణ్యకుమారుడు జన్మించాడని తెలుస్తోంది.

శ్రీ కంఠ చోళుని పూర్వీకులలో ఒకరైననూ రాజ్యపాలన చేసినట్లు ఆధారాలు లభించలేదు. యిక పుణ్యకుమారుడి తాత ధనుంజయవర్మ, తండ్రి మహేంద్రవిక్రముడు చోళమహారాజు పేరు పైనే రాజ్యపాలన చేసినట్లు శాసనాధారాలున్నాయి. అదే విధంగా పుణ్యకుమారుడి తర్వాత అతని తనయుడు విక్రమాదిత్యుడు, శక్తికుమారుడు, రెండవ విక్రమాదిత్యుడు, ఉత్తమాదిత్యుడు, ఇతని తమ్ముడు సత్యాదిత్యుడు, ఇతని కొడుకు విజయాదిత్య చోళుడు రాజ్యాధికారం చేసినట్లు తెలుస్తోంది.

'కొందరు చోళరాజులు క్రీ.శ. **550** ప్రాంతములో పల్లవులకు సామంతులుగా వుండి కడప మండలాన్ని పాలించారు. పుణ్యకుమార చోళుని తామ్రశాసనాన్ని బట్టి ఈ వంశీయుడైన నందివర్మ క్రీ.శ. **550-575** మధ్య కడప మంలాన్ని పరిపాలించినట్లు తెలుస్తోంది. నందివర్మకు సింహవిష్ణువు, సుందరవర్మ, ధనుంజయ వర్మలనే ముగ్గురు

కుమారులున్నారు. అందులో ధనుంజయుడు కలమళ్ళ శాసనాన్ని వేయించాడు. సుందరవర్మ కుమారుడు పరిప్రతాపచోళుడు క్రీ.శ. 575-600 మధ్య కాలంలో 'హిరణ్యరాష్ట్రం'ను పాలించినట్లు తెలుస్తోంది. ఇతనికి మహేంద్ర విక్రమవర్మ, ముదిత శిలాక్షర, నవరామాది బిరుదులు వున్నాయి. ఇతడికి గుణముదిత, పోర్మ్కుఖ (పుణ్యకుమార చోళ) కుమారులు. పుణ్యకుమారుడు క్రీ.శ. 600-625 మధ్య హిరణ్య రాష్ట్రాన్ని పాలించాడు. పుణ్యకుమారుడి అనంతరం అతడి కుమారుడు విక్రమాదిత్య చోళరాజు క్రీ.శ. 625 నుంచి 650 వరకు పాలించాడు. ఇతడికి 'చోళ మహారాజాధిరాజా' అనే బిరుదుంది. తర్వాత శక్తి కుమారుడు క్రీ.శ. 650-675 వరకును, సత్యాదిత్యుడు క్రీ.శ. 675-700 వరకు రేనాడును పరిపాలించారు.

సత్యాదిత్యుడు రేనాటి రాజ్యం ఏడువేల గ్రామాలు, సిద్ధి వెయ్యి (సిద్ధవటం) గ్రామాలను పాలించాడు. అతని తర్వాత ఎళం చోళరాజు రేనాటిని పాలించినట్లు నల్ల చెరువు పల్లి శాసనమును బట్టి తెలుస్తోంది. ధనుంజయ చోళుడను రాజు అల్వాడిలో ఆరొందలు గ్రామములకు అధిపతిగా వున్నట్లు తుముకూరు జిల్లాలోని శాసనముల వలన తెలుస్తోంది. కడప ప్రాంతాన్ని పాలించిన పరిప్రతాప చోళుడే, వీరప్రతాప చోళుడని నిర్ణయించినారు. తర్వాత ఎరియుమ, విజయకామ, వీరార్జును, అగ్రణిపిడుగు, కొక్కిలి మహేంద్రవర్మ, ఎళచోళ, నృపకామ, దివాకర, శ్రీకాంత చోళులు పాలించినట్లు శ్రీకాంత చోళుని శాసనాల వలన తెలుస్తోంది. వీరందరూ క్రీ.శ. 600-850 వరకు పాలన సాగించారు. అనంతరం వీరు చాళుక్యులకు సామంతులుగా వ్యవహరించారు.

## రేనాటి చోళుల వంశవృక్షం
## (సూర్యవంశం)



| తరం | | |
|---|---|---|
| 5వ తరం | విజయకామ (క్రీ.శ. 650) | మొదటి విక్రమాదిత్య (క్రీ.శ. 650) |
| 6వ తరం | వీరార్జున (క్రీ.శ. 675) | శక్తికుమార (క్రీ.శ. 675) |
| 7వ తరం | అగ్రణి పడిడుగు (క్రీ.శ. 700) | రెండవ విక్రమాదిత్య చోళమహారాజు చోళమహారాణి భర్త (క్రీ.శ. 700) |
| 8వ తరం | కోకిలి (క్రీ.శ. 725) | ఉత్తమాదిత్య (క్రీ.శ. 725), సత్యాదిత్య (క్రీ.శ. 725) |
| 9వ తరం | రెండవ మహేంద్ర (క్రీ.శ. 750) మానరవి, మారుణాపిడుగు | బాణరాజుల పితూరీ |
| 10వ తరం | ఎళంబోళ (క్రీ.శ. 775), కాపిచోళ ముత్తరాజు (క్రీ.శ. 775) | పృథ్వీవల్లభ విజయాదిత్యచోళ (క్రీ.శ. 750) |
| 11వ తరం | నృపకామ (క్రీ.శ. 800) | |
| 12వ తరం | దిహికర (క్రీ.శ. 825) | |
| 13వ తరం | శ్రీకంఠ ఆధిరాజు (క్రీ.శ. 850) | |

## పరిపాలనా విధానం

రేనాడు రాజ్యంను పరిపాలనా సౌలభ్యం కోసం మండలములు గాను, విషయములు గాను విభజించారు. గ్రామాల్లో రట్టొడ్లు లేక రాట్టులు ప్రాముఖ్యత పొంది వుండేవారు. వీరు గ్రామాల్లోని రైతుల నుంచి పన్నులు వసూలుచేసి రాజకోశాగారంకు చేర్చేవారు.

'తురమునూడ్ల బాదెయ రట్టొడ్లు గుడ్లు ఎత్తిఇచ్చిరి. వారి పెణ్డంబు మారకణ్డరు, వారి కొడుకు చాముణ్ణెయ సత్యాభిమాని పెట్టిఇచ్చి ఆసన బదిగల్లు (S.I.I. Vol. X No. 598) అనే శాసనం లభించింది. ఆకాలంలో శాసనాలను విశ్వబ్రాహ్మణలు, కమ్మరులు రాసేవారు. రేనాటి చోళుల శాసనములలో ఒక చోట 'విరిపటితి కమ్మరి వినియణ వ్రాసె' (S.I.I. Vol. X No. 604) అని వుంది.

బ్రాహ్మణులకు గాని, దేవాలయాలకు గాని దానమిచ్చిన భూమిని, 'పన్నశ' అని పిలిచేవాళ్ళు. పొలమును 'చేను' అనే వ్యవహరించేవారు. భూమిని వ్రితుడ్లలోనూ, మఱుతుడ్లలోనూ కొలిచేవారు.

'మఱుతుడ్లు' అనే పదం కొన్ని శాసనాల్లో మఱుతులు, మఱుతురులు, మఱ్తులు అని ప్రయోగించడం జరిగింది.

రేనాటి చోళుల పాలన కాలములో జరిగిన యుద్ధాల్లో వీరు ఒకరినొకర్ని కత్తులతో పొడుచుకొని మరణించిన సంఘటనలు ఎక్కువగా జరిగినట్లు శాసనాల వల్ల తెలుస్తోంది. యుద్ధం నందు మరణించినవారు స్వర్గలోకం పోతారనే నమ్మకం ఆనాడు ప్రజల్లో వ్యాపించి వుండేది. (S.I.I. Vol. X No. 593)

'శ్రీ గణ్డ సజ్కలియ్య మఱది కొఱనడిప్పదీరెయ, వల్లెపప్ప యెళువాన్టు చోడుళ తొడ పొడిచి వీరలోకమ్పోగె. (S.I.I. Vol. X No. 628).

రాజు దైవాంశ సంభూతుడు. మానవాతీతుడని ఆకాలంలో ప్రజలు భావించారు. గ్రామ పరిపాలన అత్యంత పటిష్టంగా వుండేది. తలారి గ్రామ రక్షకుడుగా వ్యవహరించేవాడు. దుర్గాలు దుర్గాధ్యక్షులచే పాలించబడుతుండేవి.

రేనాటి చోళరాజ్య నిర్వాహణ పరిపాలనా సౌకర్యం కొరకు రాష్ట్రములుగా విభజించారు. హిరణ్యరాష్ట్రం (ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలు), కురుమరము, సిద్దివేయి, అనే విభాగాలు ఇందులో వుండేవి. అనంతపురం జిల్లాలోని నిడుగల్లు కూడా రేనాటి రాజ్యములోనిదేనని తెలుస్తోంది. ఈ విభాగాల పరిపాలన కొరకు రాజులు తమ వంశములోని వారినిగాని, యువరాజులను గానీ నియమించేవారు. ముఖ్యమైన కొందరు ఉద్యోగులకు 'దుగరాజ' లేదా 'దుకరాజ' బిరుదులిచ్చి మండలాధిపతులుగా నియమించేవారు. క్రింది స్థాయి ఉద్యోగులలో 'కాలు' అనేవారు కొన్ని శాఖలకు అధ్యక్షులుగా ఉన్నట్లు తెలుస్తోంది. రేవణకాలు, పుద్దనకాలు ఇలానే వున్నాయి. మేకలు, గొర్రెలు, చేలు, ఎడ్లు మొదలైన పశువులపై పన్నులు చేయువారో, ప్రత్యేక అధికారులో ఈ ఉద్యోగులు అయివుంటారని తెలుస్తోంది. తరట్లకాలు అనే ఉద్యోగి నేరస్తులను కొరడాతో కొట్టి శిక్షించే అధికారిగా గుర్తించబడ్డాడు.

భూమి కొలతలకై ప్రత్యేకించి రాచమానములు వున్నట్లు శాసనములు తెలుపుతున్నాయి. పుణ్యకుమారుడి తండ్రి అయిన మహేంద్రవర్మ శబ్దశాస్త్ర విద్యవేత్త అని శాసనంలో పేర్కొనబడింది. ఇతనికే ముదిత శిలాక్షరుడనే బిరుదు కూడా వుంది. తన తండ్రి ధనుంజయవర్మ ప్రారంభించిన తెలుగు భాషోద్యమాన్ని ఇతడు ప్రోత్సహించాడు.

అశోకుని శాసనాల్లోనూ, శాలంకాయన, ఇక్ష్వాకుల, రేనాటి రాజుల శాసనాల్లో పలువురి అధికారుల హోదాలు గుర్తించబడ్డాయి. కడప జిల్లాలో రేనాటి చోళుల శాసనాల్లో గేదెలు, మేకలు మొదలైన జంతువులు, ఆనాటి గోగ్రహణ యుద్ధాలలో మరణించిన యోధుల వివరాలను నమోదు చేసే

ప్రభుత్వ అధికారుల ప్రస్తావన వుంది. కొత్త వ్యక్తులు ఎవరెవరు గ్రామంలోకి వస్తున్నారో తెలుసుకోవడం, వారు గ్రామం వదలిపెట్టి వెళ్ళే వరకు వారి కదలికలను గమనించడానికి 'ఆరక్షాధికృతుడు'ను నియమించారు. చాటులు, గౌల్మికులు, నియుక్త అధ్యక్షులు, రాచవార్తహరులు పూర్తిగా రాజుకు సంబంధించిన అధికారులుగా చెప్పుకోవచ్చు. రేనాడు తెలుగు శాసనాలు రచ్చకాలు, కాలులను పేర్కొంటాయి. వీళ్ళు రాజు, గ్రామ పెద్ద (ఊరు-పెంకాలు)ల సేవకులు.

| <u>అధికారులు</u> | <u>విధులు</u> |
|---|---|
| రట్టక / రాష్ట్రికుడు | జిల్లా అధికారి |
| తలవరి | కాపలదారు (ఆరక్షాధికృతుడు) |
| గ్రామేయకులు | పౌరసంస్థ సభ్యులు |
| దండ - నాయకుడు | సేనానాయకుడు |
| ప్రశాస్తి | రాజు ఆదేశాలను అమలుపరిచేవాడు |
| సమాహర్త | సామాన్యంగా గ్రామ ఆదాయాన్ని వసూలు చేసేవాడు |
| మదబిక | కొన్ని గ్రామాల అధికారి |
| నేయిక / గామభోజక | గ్రామాధికారి |
| ఆరక్ఖాధికత | రక్షణాధికారి |
| గూమిక గౌల్మిక | గ్రామగడి కావలి |
| తూతిక త్రైర్థిక | తీర్థంవద్ద నియమించిన అధికారి |
| భద - మానుస | రక్షక భటుడు |
| పెసన - పయూత్తి | రాచవార్తాహరుడు |

క్రీ.శ. 600-1000 మధ్యకాలంలోని రేనాటి చోళుల కాల శాసనాలలోనూ, ఇతర తెలుగు శాసనాల్లోనూ తరచూ 'కాలు' అనే ప్రత్యయం కలిపిన పేర్లు కన్పిస్తు వుండడాన్ని గురించి చరిత్ర పరిశోధకుడు ఎం.ఎస్. శర్మ 'మాలేపాడు - పోట్లదుర్తి శాసనాల్లో చర్చించిన విధానాన్ని వ్యాస-సంగ్రహం, జి.వి. రామమూర్తి స్మారక సంచికలో పొందుపర్చారు. 'కాలు' అనేది సంస్కృత పదం 'పాదా'నికి తెలుగని తేల్చి, దీనిని వ్యక్తుల పేర్లకు

గౌరవంగా చేర్చుతుంటారని అభిప్రాయపడ్డారు. అయితే తొలి తెలుగు శాసనాల్లో 'కాలు' పదం వేరే అర్థాన్ని కల్గజేస్తుందని 'ప్రాచీనాంధ్ర దేశచరిత్ర'లో పి.వి. పరబ్రహ్మశాస్త్రి వ్యక్తీకరించారు. ఈ మాట వైయుక్తిక నామాలతో పాటూ, పదవీ నామాలలోనూ కన్పిస్తోందని ఉదాహరణలతో సహా వెల్లడిస్తూ ఈ ప్రత్యయం 'కాలు' సామాన్యంగా ఒక అధికారిగా వీరు విశ్లేషించారు.

| | |
|---|---|
| రేవణ-కాలు<br>వుద్దణ-కాలు | గ్రామకరణం లాంటి అధికారులు |
| చేల-కాలు<br>చెం-గాలు | చేలను కాపాడే అధికారి |
| ఎడ్ల-కాలు | పశువులకు సంబంధించిన అధికారి |
| తరట్ల-కాలు | నేరస్థులను కొరడాతో శిక్షించే బాధ్యత కల్గిన అధికారి (తరటు = కొరడా) |
| ఎన్పుల-కాలు పెర్వా<br>ఎనుముల-కాలు పెర్వా | బఱ్ఱెల అధికారి |
| రచ్చ-కాలు | రాచ గ్రామాధికారి |
| ఊరి-పెన్-కాలు | గ్రామ పెద్ద |
| కుండి-కాలు | చెరువుల, కుంటల నిర్వహణను చూసే అధికారి |
| మేషకాలు | మేకలు, గొఱ్ఱెల లెక్కను నమోదు చేసే అధికారి |
| కొఱ్ఱు-కాలు | సరుకులు కొనుగోలు చేసే అధికారి |
| కోరు-కాలు | పంటలలో రాజువంతు వాటాను వసూలు చేసే అధికారి |
| | (EI XXX.P.16 text 1.18 Tippaluru Inscription) |

పై ఉదాహరణలవల్ల 'కాలు' అనే ప్రత్యయాన్ని వైయుక్తిక నామాలకు, ఇతర పదాలకు చేర్చడం వల్ల, ఆ వ్యక్తి రాజు లేక గ్రామ సభ లేక వర్తకులు నియమించిన అధికారి అని తెలుస్తోంది. ఎర్రగుడిపాడు శాసనంలో ప్రస్తావితమైన 'కుండి-కాలు' పన్నసదానం చేశాడని, అతడు ఎరికల్ ముత్తురాజు చేత నియమించబడిన వాడని తెలుస్తోంది. అతడు చెరువులు, కుంటలు బాధ్యత చూసే అధికారిగా కన్పిస్తాడు. 'కుండి కాలు' అంటే పొలాల పర్యవేక్షణాధికారిగా చెప్పుకోవచ్చు.

అంటే 'చేల-కాలు' వంటివాడు. 'కుంట' లేక 'గుంట' అన్న పదం తరచు మధ్యయుగ శాసనాలలో ఓ భూమి చెక్క (పరిమాణం) అన్న అర్థంలో కనిపిస్తుంది. పంటలో రాజు వాటాను వసూలు చేసే అధికారిని 'కోరు-కాలు' అంటారు. భూమి చెక్కనుండి నాలుగు పుట్ల ధాన్యాన్ని రాజువాటాగా గ్రహిస్తున్న అధికారి ధనంజయ-ఫల-ధారని అది చెప్తుంది. 'ఫల-ధారు'డంటే దిగుడిని ఉజ్జాయింపు కట్టి, అందులో రాజు వాటాను గ్రహించేవాడు (ఫల=దిగుబడి; ధారణ = లెక్కకట్టు, అంచనా వేయు). పంటకోతకు సిద్ధమయినప్పుడు, రాజు అధికారి పొలాలను పర్యటించి ప్రతి సందర్భంలోనూ, భూమి ధారణం ప్రకారం, ప్రభుత్వవాటా మూడోవంతో, నాలుగోవంతో లేక ఆరోవంతో నియతాల ప్రకారం నిర్ణయిస్తాడు ('ముక్కోరు' = 1/3 వాటా; 'సంగోరు' = 1/2 వాటా; 'నాంగోరు' = 1/4 వాటా). కనుక, 'కోరు-కాలు', 'ఫల-ధారు'డు ఒక అధికారే. తెలుగులో 'కొన్రు' అంటే కొనటం లేక తీసుకోవడం. కనుక ఆ సమాసపదం 'కొన్రు-కాలు'ను రేపుపట్నంలోనో, మరెక్కడో కొనుగోలు చేయడానికి ఒక వర్తకుడు నియమించిన ప్రతినిధిగా అర్థం చేసుకోవడం సహేతుకమే. కొన్ని సందర్భాలలో 'కొన్రు' అన్న పదం సామాన్యార్థంలో పంటలో రాజు వంతును వసూలు చేయడానికి వర్తిస్తుంది. ఈ అర్థంలో కొన్రు-ఊరు, కొన్రుపాడు లాంటి పేర్లతో గ్రామాలు కూడా ఉన్నాయి; ఇక్కడ ప్రభుత్వాధికారులు బసచేసి, ఆ చుట్టుపక్కల గ్రామాల నుండి తెచ్చిన రాజువంతు పంటను గ్రహిస్తారు. అలా రెండు పదాలూ - 'కోరు-కాలు', కొన్రు-కాలు' కొద్ది

తేడాతో ఒకే అర్థాన్నిస్తాయి. 'చేల-కాలు, అంటే అతడు పొలాల పర్యవేక్షణాధికారి. వేల్పుచర్ల, తిప్పలూరు శాసనాలలో ఈ మాట సంధిరూపంలో 'చెం-గాలు' (చేను+కాలు)గా కనిపిస్తుంది. 'చేను' అంటే వ్యవసాయ పొలం.

ప్రాథమికంగా వ్యవసాయక సమాజాల వారి జనావాసాలు, పలువురు సంబంధిత చేతివృత్తుల వారు, సేవలవారు ముఖ్య సమాజంతో సహజీవనం చేస్తూ వుంటారు. వ్యవసాయంతో పాటూ ప్రధాన వృత్తులను విభజించుకొని కాలగమనంలో సమాజం శాఖలుగా విభాగం కావడాన్ని గమనించవచ్చు. పలు శాసనాల్లో మనకు 'అష్టదశ ప్రజలు' వివరాలు కనిపస్తాయి. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభాకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాతక, లుబ్ధక, చండాల, మాతంగులనే వారిని ఈ జాబితాలో చేర్చారు.



*పెద్దచెప్పలి ఆలయంలోని నంది*

# రేనాటి చోళులు తెలుగు భాషకు చేసిన సేవ

దక్షిణ భారతదేశంలో సంస్కృత, ప్రాకృత - ద్రావిడ సమ్మిశ్రమము నుండి వెలువడిన ప్రాంతీయ భాషలలో కన్నడ భాష కంటే తెలుగు ప్రాచీనమైనదని చరిత్రకారులు జి. పరబ్రహ్మశాస్త్రి అభిప్రాయపడ్డారు. దీనికి ఉదాహరణగా క్రీ.శ. 6వ శతాబ్దికి చెందిన రేనాటి చోళుల శాసనాలను పేర్కొనవచ్చు. ప్రారంభ దశలో తెలుగు భాషలోగల అక్షర, పద, వాక్య, సంధి, సమాస, కారక, విభక్తి, వ్యాకరణ అంశాలను మార్పులకు గురవుతూ వచ్చిన పరిణామ క్రమాన్ని అధ్యయనం చేయడానికి వీలవుతోంది.

ప్రసిద్ధ చరిత్రకారులు జయంతి రామయ్య పంతులు, వేటూరి ప్రభాకర శాస్త్రి, మల్లంపల్లి సోమశేఖర శర్మ వంటి వారి పరిశోధనల వల్ల చరిత్ర, భాషావికాసాలు వాటి గమనం లోతుగా చర్చించబడింది. వారి అభిప్రాయాల పట్ల భేదాలు ఉన్నప్పటికీ జరిగిన అధ్యయనం వల్ల నూతన అంశాలు ఎన్నో చరిత్ర పుటల్లో చోటు చేసుకున్నాయి. కలమళ్ళ శాసనంలో ప్రకటించబడిన 'ధనుంజయుదు రేనాణ్డు, పళన్ చిఋంబూరి రేవణకాలు' అనే దాంట్లో దు, ఋ అక్షరాలు రెండు రాయబడి వుండడం వల్ల ఇవి రెండూ వేర్వేరు అక్షరాలని నిర్ధారణకు వచ్చారు.

'ధనుంజయుదు' అనే పదంలోని దు క్రమంగా న్డు, ణ్డు, ండు, ం డు, అనే ప్రథమా విభక్తి ప్రత్యయమైందని, ప్రొద్దుటూరులోని రామేశ్వరంలో లభించిన శాసనంలోని ఱ, డ, ళ లు స్పష్టంగా రాయబడి వుండడాన్ని బట్టి ఇవన్నీ భిన్నమైన అక్షరాలేనని కూడా చరిత్రకారులు ఒక అభిప్రాయానికి వచ్చారు. రేనాణ్డు + ఏళుచు = "రేనాణ్డేళుచు" అనే పదరూపం రామేశ్వర శాసనంలో కన్పిస్తుంది. "పన్నవీస" = పనాశ = పన్నస = దానం చేసిన భూమి అనే అర్థం పరిణామం క్రీ.శ. 625 నాటి తిప్పలూరు శాసనం ద్వారా

గ్రహించవచ్చు. తెలుగులో వాక్య రచన, శాసన భాష నిర్మాణమవుతున్న క్రమాన్ని రేనాటి చోళుల శాసనాల్లో పరిశీలించవచ్చు. అంతకు పూర్వం ఉన్న రాజుల కాలంలో తెలుగుభాష ప్రచారంలో వున్నప్పటికీ దానిని శాసన భాషగా ఉపయోగించలేదని, ప్రాకృత వాక్యాల స్థానంలో మాట్లాడడానికి ఉపయోగించే తెలుగుభాషా పదాల్ని చేర్చడం గొప్ప విశేషంగానే చరిత్ర భాషా పరిశోధకులు భావిస్తున్నారు. క్రమక్రమంగా రాత భాషగా తెలుగు రూపాంతరం చెందడాన్ని రేనాటిచోళుల శాసనాల్లో స్పష్టంగా గమనించవచ్చు. ధనుంజయుని కలమళ్ళ శాసనం ద్వారా ఆనాటి రాజుల పరిపాలనా విధానాలు, వారి దానధర్మాలు, బిరుదులు, పాపానికి విధించే శిక్షలు వంటి అంశాలు తెలుసుకవోచ్చు.

ప్రాచీన తెలుగు శాసనాలలో వాక్య రచన యిప్పటి కంటే విలక్షణంగా వుండడానికి ప్రధాన కారణం అని సాధారణంగా శాసనాలు రాసే విద్వాంసులు రాసినవి కావు. అంతవరకు ప్రాకృత భాషలోనో, సంస్కృత భాషలోనో వాక్యాలు కన్పిస్తాయి కానీ అప్పుడప్పుడే ద్రవిడ, ప్రాకృత, కన్నడ, సంస్కృత భాషలోని పదాలతో పాటూగా తెలుగు పదాలు జోడించి వాక్యనిర్మాణం చేయడం అనేది మొదటి తెలుగు శాసనాల్లో స్పష్టంగా అధ్యయనం చేయవచ్చు. గ్రామ్య భాషగా ఉన్న తెలుగును శాసనభాషగా మార్చే క్రమంలో కొన్ని లోపాలు కూడా చోటుచేసుకొని వుండవచ్చని, ఉచ్ఛారణలో వుండే భేదాలు కూడా పరిగణలోకి తీసుకొని అభిప్రాయానికి రావల్సి ఉంటుందని కూడా ఒక అభిప్రాయం.

తెలుగు భాష పరిణామక్రమం, సంప్రదాయాలు, స్వరూప స్వభావాలను, లిపి రూపాలను అధ్యయనం చేయడానికి 'తొలి తెలుగు శాసనం' ఉపయుక్తమౌతోంది. ప్రాచీన పద రూపాలు, ద్రావిడ వర్ణాలు, లిపిసంకేతాలు, రేప సంకేతాలు, సముచ్ఛయ ప్రత్యయాలు వంటి వాటన్నింటిని పరిశీలించడానికి రేనాటి చోళులు వేసిన తొలితరం శాసనాలన్నీ దోహదపడ్తున్నాయి. ప్రాకృత, ద్రావిడ భాషల నుంచి తెలుగు భాష కొత్తగా జీవిం పోసుకుంటున్న పరిణామాక్రమం, శాసన భాషగా లిపి నిర్మితం కావడాన్ని మనం రేనాటి చోళుల తొలి తెలుగు శాసనాల ఆధారంగా అధ్యయనం చేయవచ్చు.

## శాసనాల్లో తేదీతోపాటూ 'వారం' కూడా!

పుణ్యకుమారుడి తిప్పలూరు శాసనంలో ఆనాటి తేదిని తెలుపుతూ 'కార్తీక' చీకు (బహుళ) విదియ, సోమవారము, పునరుపుష్యమి (పునర్వసు నక్షత్రం), బృహస్పతి హోర ప్రకటించబడినవి. ఈ విధముగా శాసనాలలో వారమును పేర్కొనడం తెలుగు ప్రాంతంలో అత్యంత అరుదైన విషయంగా చెప్పుకోవచ్చు. పుణ్యకుమారుడు గొప్ప విద్వాంసుడుగా కూడా కీర్తి పొందాడు.

## వాస్తు విధానం

ప్రొద్దుటూరు దగ్గర పెన్నానది ఒడ్డున రామేశ్వర ఆలయమును 'పోరుమ్మఖరామ' అను బిరుదుతో పుణ్యకుమారుడు కట్టించాడు. అక్కడి శాసనంలోనే అతడ్ని 'పృథ్వీ వల్లభ'అనే బాదామి చాళుక్యరెండవ పులకేవిని ఓడించి వుండవచ్చుననే అభిప్రాయం కూడా వుంది. ఆ ఆనందంతోనే తన బిరుదుతో రామేశ్వర ఆలయాన్ని నిర్మించి వుంటాడని భావన. ఆతడి భార్య వసంత్త పోటి (వసంతపోరి) కూడా ఇక్కడ దానములు చేసినట్లు శాసనాలు వెల్లడిస్తున్నాయి. కానీ విజయనగర రాజుల కాలంలో ఆ ఆలయాన్ని పునర్మిర్మాణం చేసినట్లు తెలుస్తోంది. అత్తిరాలలో ప్రేతేశ్వరాలయం, పరశురామేశ్వరాలయం, గజపృష్ఠాకారంలో 8వ శతాబ్దం వాస్తుతో ఆలయాల నిర్మాణం జరిగింది. చిలమకూరు, పొత్తపిలలో కూడా చారిత్రక ఆధారాలు లభించాయి.

'కడప మండలమును పాలించిన చోడులు రేనాటి చోడులు. తెలుగు భాషలో తొలుదొల్త శాసనములను ప్రకటించిన కీర్తి రేనాటి చోళులకే లభించినది.'

- బి.యన్. శాస్త్రి
(ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి)

# కలమళ్ళ

'కలమళ్ళ'

మనం ఎంతో గొప్పగా, ఘనంగా తెలుగ భాషాభిమాన చాటి చెప్పుకుంటూ 'ప్రాచీన హోదా' పొందడంలో చారిత్రక ఆధారంగా నిల్చిన 'తొలి తెలుగు శాసనాన్ని' అందించిన ప్రాంతం.

క్రీ.శ. 575లో 'ఎరికల్ ముత్తరాజు' బిరుదుతో ధనుంజయుడు యర్రగుంట్ల మండలం కడప జిల్లా కలమళ్ల గ్రామంలోని చెన్నకేశవాలయం ప్రాంగణంలో వేయించిన తొలి తెలుగు శాసనాల పరిస్థితి ఇప్పుడు దయనీయంగా వుంది. అప్పుడెప్పుడో కొన్ని రాతిశాసనాలు మద్రాసు మ్యూజియానికి తరలిపోగా మిగిలి పోయిన వాటి పరిస్థితి చూస్తే ఏ చరిత్ర పరిశోదకుడికైనా, ఏ తెలుగుభాషాభిమానికైనా హృదయం చెమ్మగిల్లుతుంది.

కలమళ్ల చెన్నకేశవాలయం బయట, రోడ్డు ప్రక్కన నిలువెత్తు రాతి శాసనం నిస్సహాయంగా నిలబడి ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ తొలి తెలుగు లిపిని పోగొట్టుకుంటూ కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూ కన్పిస్తుంది. మరొక శాసనం బండరాళ్ళ మధ్య పడివుంటే, ఇంకొకటి పిచ్చి మొక్కలమధ్య, కంప పొదలమధ్య పడివున్నాయి. అక్కడితోనే ఈ కత ముగియలేదు.

అదే ప్రాచీన హోదాకల్గిన యర్రగుడిపాడు, మాలేపాడు ప్రాంతాల్లోని రాతి శాసనాల పరిస్థితి కూడా ఇలాగే వుంది. కొన్ని శాసనాలు ముక్కలై లిపిని కోల్పోతే, మరికొన్ని రాళ్ళ దిబ్బల మధ్య, ముళ్ళ పొదల మధ్య దీనంగా రక్షించి, కాపాడమంటూ వేడుకుంటూ కన్పిస్తాయి.

నాడు స్వర్ణయుగాన్ని చూసిన తొలి తెలుగు లిపి లిఖించిన శాసనాలకు నేడు కాని కాలం దాపురించింది.

వాటి విలువను గుర్తించేవారు లేరు.

వాటిని వెలికితీసి సంరక్షించి భావితరాలకు చరిత్రను అందించాలనే స్ఫూర్తి నిండినవారు లేరు.

కడప జిల్లా కేంద్రం నుంచి 58 కి.మీటర్ల దూరంలోని కలమళ్లకు చేరుకోవాలంటే సరైన రవాణా సౌకర్యం కూడా లేదు. ప్రక్కనే వున్న ఆర్.టి.పి.పి. (రాయలసీమ థర్మల్ పవర్ ప్లాంట్) మార్గమే ఆధారంగా కన్పిస్తుంది. లేదంటే ఇంటర్ సిటి ప్యాసింజర్ మాత్రమే అక్కడ ఆగుతుంది. ముద్దనూరు - యర్రగుంట్ల స్టేషన్ల మధ్య కలమళ్ల స్టేషన్ వస్తుంది. అక్కడి నుంచి వూర్లోకి 3 కి.మీటర్లు వెళ్లాలి. పాతూరులోని చెన్నకేశవాలయం అంటే ఎవర్ని అడిగినా చెప్తారు. అదే మన తొలితెలుగు శాసనానికి పుట్టినిల్లు. అక్కడ మనకు ఇప్పుడు నాలుగు శాసనాలు లభ్యమవుతున్నాయి. అవి కూడా క్రమ క్రమంగా లిపి అక్షరాలను కోల్పోతూ రాళ్లుగానే మిగిలిపోతూ కన్పిస్తాయి. ఒక శాసనం గుడి ప్రక్కనే వున్న ప్రాథమిక పాఠశాల ఆవరణంలో చాలా భాగం భూమిలోకి కూరకపోయి తలభాగం మాత్రం బయటికి కన్పిస్తూ వుంటుంది.

మరొక రాతి శాసనం పిచ్చి మొక్కల మధ్య దర్శనమిస్తుంది. మధ్య దర్శనమిస్తుంది. ఇంకో శాసనం సగానికి నడుములు విరిగి విలవిలలాడుతూ పలకరిస్తుంది. రెండవ తెలుగు శాసనం లభించి చరిత్ర పుటల్లో నిలిచిపోయిన యర్రగుడిపాడులో అయితే పరిస్థితి మరింత విషాదకరం. చెన్నకేశవస్వామి ఆలయం ఆవరణలో చుట్టూ పరిచిన బండ పరుపులో శాసనాన్ని కూడా గ్రామస్థులు చేర్చేశారు. నిలువెత్తు శాసనంలోని లిపి మొత్తం కొట్టుకపోగా ఇప్పుడు బండమాత్రం మిగిలి కన్పిస్తుంది. యిక గోడలకు బిగించబడివున్న శాసనాలకు సున్నాలు వేయడం, ఎర్రమట్టిచారలు పూయడంతో మరింత లిపి రూపును కోల్పోయింది. శాసనాలను ఎలా రక్షంచి కాపాడు కోవాలో తెలియక పోవడం, చరిత్రను బాధ్యతగా భద్రపరిచి భావితరాలకు అందించాల్సిన శాఖలు నిరామయంగా వుండడంతో ఈ

శాసనాలకు దుస్థితి దాపురించింది. మాలేపాడులోని శాసనాలకు కూడా ఇలాంటి దుర్గతే పట్టివుంది. వేణుగోపాలస్వామి దేవళం లోని రెండు శాసనాలు క్రమక్రమంగా లిపిని కోల్పోతున్నాయి. రాళ్ళ మధ్య కదిలించడానికి కూడా వీలు లేకుండా మరొక శాసనం కన్పిస్తుంది. చుట్టూ పిచ్చి మొక్కలు. రేనాటి రాజు పుణ్యకుమారుడు వేసిన శాసనాలు ఇవి. దీన్ల గురించి ఎవరు పట్టించుకుంటూ వుండారని" గ్రామస్థుడు మాలేపాడు వెంకటరెడ్డి ఆవేదన చెందుతున్నాడు.

పైకి తెలుగు భాషాభిమానం అని గుండెలు చీల్చుకొని తెలుగు తల్లిని చూపించే వాళ్ళందరూ ప్రస్తుతం తెలుగు శాసనాలకు మనమిస్తున్న గౌరవాన్ని, రక్షణను గురించి ఆలోచించాల్సి వుంది. సభలు, సమావేశాలతో కాలాన్ని సాగించుకుంటూ పబ్బం గడుపుకొనే మేధావి వర్గం వారు కనీసం ఒకనైనా మేల్కొని మన చరిత్ర వారసత్వాన్ని కాపాడుకోవడానికి చిత్తశుద్ధితో కృషి చేయాలి. కడప జిల్లాలోని పర్యాటక ప్రాంతాల అభివృద్ధి కోసం రాష్ట్ర ప్రభుత్వం 30 కోట్ల రూపాయలు కేటాయించింది. కానీ ఎవరికీ ఈ శాసనాలు కానీ, కలమళ్ల, మాలేపాడు, యర్రగుడిపాడు వంటి చారిత్రాత్మక ప్రదేశాలు కానీ పట్టడం లేదు. వారి ప్రాధాన్యతలన్నీ వేరే విధంగా వుంటాయి. చరిత్ర మీద ఏమాత్రం అవగాహన కానీ, ఆసక్తి కాని లేని వారే ఇలాంటి కార్యక్రమాలకు సారథులుగా వుంటూ వుండడం చరిత్ర చేసుకుంటున్న మరో పాపం... తొలి తెలుగు శాసనాలకు సైతం తప్పని శాపం!

తెలుగు లిపి పరిణామ క్రమాన్ని, శాసన భాషగా మారిన వైనాన్ని, నాటి సామాజిక పరిస్థితులను అధ్యయనం చేయడానికి మనకు మిగిలిన ఏకైక ఆధారాలు ఈ శాసనాలు. తొలి తెలుగుతో పాటూ, దాని రూపురేఖ స్వరూపాలను అందించిన రేనాటి చోళుల పాలనాంశాలను కూడా ఈ శాసనాలు ఆవిష్కరిస్తాయి. తెలుగు భాష ప్రాచీనతకు ఆధారమైన ఈ శాసనాలను మనం ఎంత శ్రద్ధతో కాపాడుకోవాలి? కానీ జరుగుతున్న దేమిటి?

# ఎర్రగుడిపాడు

రెండవ తెలుగు శాసనాన్ని కమలాపురం తాలూకాలోని ఎర్రగుడిపాడులోని చెన్నకేశవాలయంలో గుర్తించారు. ఈ శాసనంలో ఎరికల్లు ముత్తురాజు 'కుండికాళ్ళు' అనే అధికారి సిఫార్సు చేస్తే 'ఇరువాదియాదినాల్గు' మర్తురల కొలత వున్న నేలకోటలో వుండే బ్రాహ్మణునికి దానం చేశాడు. ఈ దానానికి దుర్జయరాజుల ముత్త సాక్షులని శాసనం చెప్తుంది. చోళుల శాసనాలలో పల్లవయువరాజును పేర్కొనడం వల్ల బహుశా పల్లవులకు, చోళులకు అధికార, సామంత సంబంధాలు ఉన్నాయని తెలుస్తోంది. ఇందులో చెప్పబడిన దుర్జయరాజు కొండపడమటి, వెలమనాడు వంశాలకు మూల పురుషుడైన దుర్జయుడు కావచ్చునని, నవప్రియ ముత్తరాజు ధనుంజయుని కొడుకావచ్చునని, నవప్రియ ముత్తరాజు ధనుంజయుని కొడుకు కావచ్చునని చరిత్రకారుల భావన. ఎర్రటి ఇటుకలతో నిర్మించిన గుడి ఇక్కడ వుండడం కాల క్రమంలో గుడిపాడు పడడంతో ఈ వూరికి 'ఎర్రగుడిపాడు' అని పేరొచ్చినట్లు, అనంతరం ఈ గుడిని పునర్దురించి వూరు నిర్మాణం చేసినట్లు తెలుస్తోంది.

మరొక తెలుగు శాసనం లభించింది యర్రగుడిపాడులోని చెన్నకేశవస్వామి దేవళంలోనే. కొన్ని శాసనాలు మద్రాసు మ్యూజియానికి తరలిపోగా మిగిలిపోయిన శాసనాలు మూడు ఇక్కడే వున్నాయి. కుడివైపు గోడకు ఒకటి, ఎడమవైపు గోడకు మరొకటి పెద్దశాసనాలు వున్నాయి. ఎండకు ఎండి, వానకు తడవడం వల్ల దానిమీద వున్న లిపి మొత్తం కరిగిపోతోంది. మరొక నిలువెత్తు శాసనం ఆలయం చుట్టూ పరిచిన బండపరుపులో కల్సిపోయింది. దీనిని గ్రామస్థులు పట్టించుకోకుండా ఈ పని చేశారు.

ఫలితంగా దానిమీద లిపిపూర్తిగా పోయింది. ఇప్పుడు శాసానికి మొదట ప్రారంభంలో వుండే శంకు, చక్రాలు మాత్రం కనిపిస్తున్నాయి పాక్షికంగా! జనమేజయ మహారాజు మూలవిరాట్‌ను దేవళంలో ప్రతిష్ఠించినట్లు కైఫియత్తులు చెప్తున్నాయి. రేనాటి ముత్తురాజు దేవళాన్ని నిర్మించాడు. ఆలయం గోపురంకు చెక్కిన శిల్పకళ ఆకట్టుకొంటుంది. దేవళంలోని మూలవిరాట్‌కు పూజలు జరుగుతున్నాయి.

## మాలేపాడు

క్రీ.శ. 575 సం॥లోనే రేనాటి చోళరాజు సత్యాశ్రయుడు పోట్లదుర్తి - మాలేపాడు గ్రామాల్లో వేయించిన తెలుగు శాసనాలు ప్రసిద్ధమైనవిగా గుర్తింపు పొందాయి. రేనాటి చోళులు వేంగి - చాళుక్య లిపిలో శాసనాలు వేయించారు. అదే ఇప్పటి తెలుగు కన్నడ లిపిల ప్రాచీన రూపం. నన్నయ్య ఈ వేంగి చాళుక్య లిపిలోనే తన భారతం రాసివుంటారని పండితుల అభిప్రాయం.

పుణ్యకుమారుడు వేయించిన మరొక శాసనం 'పొట్లదుర్తి - మాలేపాడు' గ్రామాల మధ్య దొరకడం వలన మరిన్ని విషయాలు తెలియవచ్చాయి. దీనిని చరిత్ర పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకటరామయ్య గార్లు వెలుగులోకి తెచ్చారు. ఈ శాసనం ఎర్రరాయి మీద చెక్కి వుంది. దీనికి ప్రతిబింబాన్ని తీసి, రాతి శాసనం దగ్గరే కూర్చొని చదివి, వారు సరిచూసుకున్నారట. గిడుగు రామమూర్తి గారి జన్మదినోత్సవ సంచికగా వచ్చిన 'వ్యాస సంగ్రహం'లో ఈ శాసనాన్ని సోమశేఖర శర్మ ప్రకటించారు. శాసనం చిన్నదే గానీ ప్రాముఖ్యం గొప్పది. ఈ శాసనానికి అర్థం 'చోళ మహారాజు' ఒప్పుకుంటే ఇనుప్రోలు అనే గ్రామంలోని రేవణ, వుద్దణ అనే కులపెద్దలు పెద్ద బ్రాహ్మనుడు 'ఇవరేడు' గారికిచ్చిన పన్నస ఇది. దీనిని 'అసివైరువు' అనే వ్యక్తి రాశాడు. ఎవరైనా దీనిని చెరిచేవాడు పంచమహాపాతకుడు అవుతాడనే అంశంకూడా శాసనంలో చెక్కబడివుంది.

## చు - లి - యె

క్రీ.శ. **640-41** సం॥ల్లో చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ రేణడు ప్రాంతాన్ని పర్యటించాడు. ఈ ప్రాంతాన్ని అతడు 'చుళి' (చు-లి-యె) అన్నాడని అంటే చోళరాజుల ప్రాంతమని చరిత్రకారుల భావన.

రేనాటి చోళరాజైన సత్యాదిత్యుడు రేనాడునూ, సిద్ధవటంనూ, చోళ మహాదేవిరాణి 'చిలమకూరు'నూ, లేబాక, అత్తిరాల ప్రాంతాలను శ్రీకాంత చోళుడు పాలించినట్లు 'మాలేపాడు' శాసనం ధృవీకరిస్తుంది.

పోర్ముఖరామ అనే బాణరాజు పెన్నేరు హద్దు గల ప్రాంతాన్ని చోళుల తర్వాత పాలించినట్లు పొట్టిపాడు శాసనం చెప్తుంది.

రెండవ కృతివర్మ మరణంతో బదామీ చాళుక్యుల పాలన అంతమై రేనాడులో చోళుల పాలన ప్రారంభమైందని చరిత్రకారుల అభిప్రాయం.

# పెద్ద చెప్పలి తామ్రశాసనాలు

పురాతత్త్వ శాసనాల సేకరణలో భాగంగా శాసన అధ్యయన శాఖకు చెందిన సహాయ సంచాలకులు ఎం.వి.యస్. ఆదిత్యశర్మ పెద్ద చెప్పలి గ్రామంలో ఆకులపాటి నరసయ్య అనే గ్రామస్థుడి నుంచి రాగిరేకుల ఫలకాలను సేకరించారు. మూడు రాగిరేకు ఫలకాలుగా లభ్యమైయ్యాయి. ప్రతి రాగి ఫలకం కుడివైపు చివర 1.4 సె.మీ. చుట్టు కొలత కల్గి వుండి రంధ్రములోని రింగుతో సహా కలిసి వున్నాయి. రాగి ఫలకాలు కలిసి వున్న రింగు చివరి భాగం తామరపుష్పం గుర్తుగల ముద్ర వేయబడివుంది. రింగులు అతర్గత చుట్టు కొలత 6 సె.మీ. కల్గి వుండగా ముద్ర 5 సె.మీ. చుట్టుకొలత కల్గివుంది. తోక వెనుకవైపుకు మడిచి వున్న సింహం ముద్ర కల్గి వుండడం విశేషం. పెద్ద చెప్పలి గ్రామ సమీపంలోని కోట పడటమిచేను ప్రాంతం త్రవ్వకాల్లో మరిన్ని ఆధారాలు లభించాయి.

రాగిరేకు ఫలకాల ముద్రపై భాగంలో సూర్య, చంద్రలు చెక్కబడి వుండగా, క్రింది భాగంలో పద్మములతో కూడిన వరసలు కూర్చబడ్డాయి.

ఈ తామ్ర ఫలకాలు కొలతలో 18.5 సె.మీ. పొడవు, 6.8 సె.మీ. వెడల్పు కల్గివున్నాయి. 2 మి.మి. మందం కలిగి ఒక కేజీ బరువుతో లభ్యమైనాయి. మొదటి, రెండు ఫలకాలు రెండు వైపులా లభించబడి వుండగా, మూడవ ఫలకం ఒక వైపు మాత్రమే లిఖించబడి వుంది.

రేనాటి చోళుల కారణంగా మనకు ఇవాళ ప్రాచీన తెలుగు వాక్య రచనా విధానం తెలుస్తోంది. రేనాటి చోళులు తాము కరికాల చోళుని సంతతికి చెందినవారమని చెప్పుకున్నారు. క్రీ.శ. 485 ప్రాంతంలో రేనాడు కరికాల చోళుని పాలనలో వుండేదని నేలటూరి వెంకటరమణయ్య గారు నిరూపించారు.

తెలుగులో మొట్టమొదటి శాసనాలలో కన్పించే రేనాటి చోళుని పేరు ఎరికల్ ముత్తరాజు ధనుంజయుడు. ఇతడు నందివర్మ కుమారుడు. ధనుంజయుని పేరుకు ముందున్న 'ఎరికల్' అనేది రేనాటి సీమలోని గ్రామమై వుంటుందని చరిత్రకారుడు పి. శ్రీనివాసాచారి అభిప్రాయపడ్డారు. రేనాటి చోళులు 'చెప్పలియా' గ్రామం రాజధానిగా, రేనాటి ప్రాంతాన్ని పాలించారు. దీనిని కమలాపురం తాలూకాలోని పెద్ద చెప్పలి గ్రామంగా గుర్తించినారు. రేనాటి చోళుల వంశవృక్షంలో 13 తరాలలో నందివర్మ క్రీ.శ. 550 నుండి, శ్రీ కంఠ అధిరాజు క్రీ.శ. 850 వరకు 26 మంది రాజుల పేర్లు తెలుస్తున్నాయి. క్రీ.శ. 575లో పాలించిన ధనుంజయుడు. ఆనాటి కాలంలో యువరాజు కాకుండా మిగిలిన రాజకుమారులలో పెద్దవాన్ని ముత్తురాజు అని పిలిచేవారు. అంటే యువరాజు తర్వాత రాజ్యానికి రాజుగా రావడానికి అవకాశాలున్న వారికే ఈ పట్టం ఇచ్చేవారు.

మద్రాసు మ్యూజియంలోని తామ్ర శాసనాల్లో పేర్కొనబడిన రేనాటి చోళులు వంశావళికి, పెద్ద చెప్పలి తామ్ర శాసనాల్లోని వంశ క్రమానికి ఎక్కువగా తారతమ్య భేదాలు లేవు. వంశక్రమంలో దివాకర (825 AD) పేరును మద్రాసు మ్యూజియంలోని తామ్రశాసనాలు సూచిస్తుండగా పెద్ద చెప్పలి తామ్రశాసనాల్లో వారి పేరు లిఖించబడక పోవడం విశేషం. రేనాటి చోళులు తమ వంశమూల పురుషునిగా కరికాళ చోళుడిని పేర్కొంటూనే వచ్చారు. పెద్ద చెప్పలి తామ్రశాసనం ప్రారంభంలో శివస్తుతి కన్పిస్తోంది. చోళరాజులు బిరుదులు ధరించారు. గోత్రాలు పాటించడం, భూమి కేటాయింపుల్లో వాటాలు రాసుకున్న తీరు నమోదు చేయబడింది.

క్రీ.శ. 625లో వచ్చిన పుణ్యకుమారుడు పోర్ముఖరామ, పురుషశార్దుల, మదన విలాస, మదముదిత, ఉత్తమోత్తమ వంటి బిరుదులు పొందాడు. ఇతని భార్య పేరు వసంతపోరి. మహేంద్ర వర్మ కొడుకైన పుణ్యకుమారుడి రెండు తామ్ర శాసనాలు, మూడు శిలాశాసనాలు లభిస్తున్నాయి. ఇతనికి గణ్వామాండు, పోర్ముఖరామ, పురుషశార్దుల అనే బిరుదులున్నాయి.

రామేశ్వర శిలాశాసనంలో 'పృథీవీ వల్లభ' అనే బిరుదు కన్పిస్తుంది. పుణ్యకుమారుడు హిరణ్యారాష్ట్రము (సీమ)ను పాలిస్తూ ప్రొద్దుటూరి వారికి కొంత భూమిని దానము చేసినట్లు ఒక త్రామ శాసనం చెప్తుంది. ఈ శాఖకు చెందిన రాజుల తర్వాత సుందరనందుని వంశములోని శ్రీకంఠచోళరాజులని రెండు తామ్రశాసనాలు మాత్రమే లభించాయి. వీరి తర్వాత వైదుంబరాజులు రేనాడును ఆక్రమించుకోగా వీరు పొత్తపి ప్రాంతానికి మరలి పోయినట్లు చరిత్ర కథనం.



అగస్త్య మహాముని చేత ప్రతష్టించబడిన శ్రీ అగస్త్యేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలోనే శ్రీ చెన్నకేశవస్వామి వారి ఆలయం కూడా వుండడం విశేషం. ప్రవేశ ద్వారం ఐదు అంతస్తుల గోపురంతో నిర్మించబడింది. వృత్తాకారంగా గర్భాలయ గోపురం కన్పిస్తుంది. భారీ నందీశ్వరుడి విగ్రహం ఎదురుగా అగస్త్యేశ్వరస్వామి లింగరూపంలో దర్శనమిస్తారు. ఈ ఆలయానికి దక్షిణవైపున శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం వుంది. ఎత్తయిన ధ్వజస్తంభం, ముఖ మండపం, అంతరాలయం, గర్భాలయం విశాలమైన ఆలయ ఆవరణ ఏర్పాటు చేయబడింది. ఆలయ ప్రాంగణంలో నాగులు, చోళరాజు, రాణిల విగ్రహాలు కూడా వున్నాయి.



కడప నుంచి ముప్పై కిలోమీటర్ల దూరంలోనూ, కమలాపురం నుంచి ఆరు కిలోమీటర్ల దూరంలోనూ 'పెద్దచెప్పలి' చారిత్రక ప్రాంతం వుంది.

# మెకంజీ కైఫీయత్తుల్లో రేనాటి చోళుల ప్రస్తావన

చరిత్రకు ఆలంబనగా నిలిచే ఆధారాల్లో కైఫీయత్తులు ప్రధానమైనవి.

రేనాటి చోళులకు సంబంధించిన మొదటి కీలక ఆధారాలు కైఫీయత్తుల్లోనే మనకు లభ్యమవుతున్నాయి.

కడపలోని సి.పి. బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రం ఇప్పటి వరకు ఆరు వాల్యూముల కడప జిల్లా కైఫీయత్తులను ప్రచురించింది.

యఱ్ఱగుడిపాడు, పెద్దచెప్పలి - చిన చెప్పలి, తిప్పలూరు, వుప్పలూరు, సంబటూరు, కోడూరు, పొందలూరు, మైలపల్లె, కంపసముద్రం, పొట్టిపాడు, వెలదురితి, కడప శహరు యొక్క పూర్వోత్తరము, శిద్ధవటం తాలూకాలో వుండే శాసనాలు కైఫీయత్తుల్లో తగిన ఆధారాలు చరిత్ర పరిశోధనకు ఉపకరిస్తాయి.

ఉదాహరణకు యఱ్రగుడిపాటు, పెద్దచెప్పల్లి, తిప్పలూరు కైఫీయత్తుల్లోని చోళరాజుల ప్రస్తావనను పరిశీలిద్దాం.

## యఱ్రగుడిపాటు

కసుబా కామలాపురానకు వాయువ్యం రెండ్డు పరువుల దూరమున పైండికాలువ సంమతు పాగేరు నదికి వుత్తర గడ్డన మౌంజె యఱ్రగుడిపాటు గ్రామం కైఫియత్తు.

పూర్వమందు జనమేజయ మహారాజు గారి వల్ల ప్రతిష్టతంబైన చంన్నకేశవస్వామి మూర్తి వుండెను. తరువాత కొన్ని దినములకు యీ చంన్నకేశవస్వామి దేవాలయం జీర్ణోద్ధారణం చేయించ్చి యీ దేవాలయానకు వెలపట వుత్తర భాగమున ప్రాచీణ హకె కంన్నడ అక్షరాలు జానడేసి నిడుపు రాతిపైన అక్షరాలు వున్నది. అవి దిగువ వ్రాశినాను.

యీశానంలో చాలా పరిశోధించి చూచిన యడల మా బుద్ధికి తోచినది యిందులో వుండ్డె శకం॥ భూనవద్రి అంటె యిందుకు శకం ౭౼౧ అయ్ను. యిందులో వుండే రాజు పేరు గుణ సంపన్న గుధు జయరాజు భిమతు రాజు ముత్తురాజు గుడి కట్టించిన అని వున్నది. గన్క మాకు యీ ప్రకారం మాత్రం తెలిశ్నిది. అక్కడ జయనివారి వల్ల వ్యెక్తం చేసుకోవలశినది. స్తళీకులు చెప్పేది యేమంట్టె చోళ రాజులు స్వల్పంగా గుడి కట్టించి నారని చెప్పుతుంన్నారు.

యీ గ్రామంలో వున్న దేవళం యిటికెవి గనుకనున్ను దేవళం పాడుగా కొంన్ని దినములు వున్నందుననున్ను యిందుకు జనులు యర్రగుడిపాడు అని వాడుకొనేవారు.

యీ స్తళమందు కొందరు కాపులు చేరి యిళ్లు కట్టుకుని వుండేవారు. అప్పుడు గ్రామానికి యర్రగుడిపాడు అనే నామము వుండెను.

తరువాత మరికొంన్ని దినములకు పడమర సీమనుంచ్చి పెడకంటి కాపు యర్రమాచిరెడ్డి అనేవాడు ధనవంత్తుడు శ్రీ పుష్పగిరి యాత్రాపరుడై యీ గ్రామాన వచ్చి రాత్రి నిలిచి నందున యర్రగుడి గ్రామములోవున్న చంన్నకేశవస్వామి స్వప్నమందు నేను నీపాలట వుంట్టున్నాను. నీవు యిక్కడనె వుండ్డుమని చెప్పగాను యీ యర్రమాచిరెడ్డి మరునాడు తన సామాను బండ్లపైన సాగించ్చుకుని మార్గస్తుడై పోగానే బండ్డి విరిగిపోయి నందున యితడు రాత్రి స్వప్నం అయిన ప్రకారం యీ గ్రామంలోనే నేను నిలవవలెను అని కాపురం గ్రామంలో నిలిచి శ్రీ చంన్నకేశవ స్వామి దేవళం కొంత్త జీర్ణోద్ధారం చేయిస్తూ వుండగాను...

## పెద్దచెప్పల్లి

కాములాపురం తాలూకు పైండికాలువ సంమత్తు మౌజె పెద్ద చెప్పల్లి చిన చెప్పల్లి గ్రామములు ౨ కి కయిఫియ్యతు.

పుష్పగిరి మహాక్షేత్రమునకు పంచ్చక్రోశమధ్మ పుష్పగిరికి పశ్చమం మూడు పరువుల దూరమున అగస్త్యాశ్రమమైన కసుబా కాములాపురానకు దక్షిణం రెండు పరువుల దూరమున ద్వాపరాంత్యమున అగస్త్యమహాముని

వల్ల వుభయ పాపఘ్ని మధ్య ప్రతిష్టితంబైన అగస్త్య మహా లింగము కలదు. కలియుగమున యీ క్షేత్రమందు విస్తరించి తాటి వృక్షములు వుండగాను కొందరు కిరాతకులు కుటీరములు వేసుక వుండేవారు. గన్క గ్రామాన్కి తాళ్లలోపల్లె అనే నామము ప్రశస్తం అయ్నిది.

తరువాత మరికొంన్ని దినములకు వుత్తర దేశము నుంచ్చి పాకటి కాపులు అంన్నదమ్ము్మలు ముగ్గురు యిక్కడ వచ్చి అరణ్యాము నరికించ్చి యిడ్లు కట్టించి వీరిలో జ్యేష్టునిపేరు చెప్పలి గన్క గ్రామానకు తన పేరు వుంచినంద్దున చప్పల్లి అనే నామము సార్థకము అయ్నిది. మరికొంన్ని దినములకు యీ అన్నదమ్ము్మలు ముగ్గురికిన్ని గృహ కలాపం సంభవించ్చి జ్యేష్టుడు కనిస్టుడు యీ గ్రామములో నిలిచినారు. రెండ్డో వాడు యీ గ్రామానకు పడమర అరపరువు దూరమున పశ్చిమం చిన పాపఘ్ని నదికి పడమర గ్రామం కట్టించి కాపురం వుండ్డెను. అక్కడ మరికొంన్ని కాపులు చేరి వుండేవారు గన్క అందుకు చినచెప్పల్లె అనిన్ని యీ గ్రామానకు పెద్ద చెప్పల్లె అనిన్ని నామము ప్రఖ్యాతి పొంద్ది, ప్రత్యేకం రెండు గ్రామములు అయ్నివి. యీ పెద్ద చెప్పల్లి గ్రామమున యిల్లు కట్టి తానకు చట్లు నరికిస్తూ వుండగా వఖ వల్మీకం కనపడి నంద్ను జంతువుల్కు ఆస్పదం అవుతున్నది అని ఆ వల్మీకం తొవ్వించ్చగాను భూమియందు పాణిపట్టముగా యీశ్వరలింగము కనిపించ్చి నంద్దున యీ వర్తమానం అప్పుడు రాజ్యాం యేలుతూ వుండే చోళరాజు తట్టు నుంచ్చి వడ్డి రాజులు ప్రభుత్వం చేస్తూ వున్నంత్తట గ్రామస్తులు యీ వృత్తాంతము వట్టి రాజులతో మనవి చేశినంత్తట వట్టిరాజులు యీ స్తళానకు వచ్చి ఆవల్మీకములో యేర్పడిన లింగ్గము చూచినవాడై ఆ లింగ్గానకు దేవాలయం కట్టించి పుండ్ర కుటీరముగా అంత్తరాళం కట్టించ్చి అందుకు తగు మాత్రం నైవేద్య దీపారాధన నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవ సంవత్సరోత్సవములు నడిచేటందుకుగాను తగు మాత్రం నిర్నయములు చేశి శివ బ్రాంహ్మలను అర్చకులుగాను యేర్పచిరి. యీ స్తళము అగస్త్యాశ్రమము అని చోళమహారాజు శేతుయాత్రాభిగతుడై యీ అగస్త్యేశ్వరుని దేవాలయానకు

దక్షణం చంన్నకేశవ స్వామిని ప్రతిష్ట చేశి రెండ్డు దేవాలయములుంన్ను విస్తారంగా కట్టించి అందుకు నడిచే మర్యాదలకు శిలాశాసనమున్ను వేయించ్చినారు.

## తిప్పలూరు

యీ యర్రగుడిపాటు గ్రామానికి పడమర ౧ పరువు దూరమున మం॥ తిప్పలూరు సంమ్మతు పైడికాలువ గ్రామం కైఫియ్యతు.

పూర్వం చోళరాయల వారి ప్రభుత్వంలో వద్దెరాయలు యేలుతూ వుండ్డగాను అప్పుడు యలమ తిప్పానాయుడు అనే అతడు వచ్చి గ్రామం కట్టించ్చెను. గన్కు గ్రామానికి తిప్పలూరు అనే నామము కలిగెను.

## మరికొన్ని చోట్ల

"పూర్వమున చోళమహారాజుగారు దక్షిణ దేశం తంజావూరు సీమ నుంచి కాసీయాత్ర పోతూ యీ మార్గాన వొచ్చి యిక్కడ పాగెలేరు తీరమున అగస్త్యాశ్రమమని పురాణోక్తముగా వినబడి యిక్కడ నివాసము చేసినంతట యీ గ్రామానకు యిశాన్య భాగమందు శివలింగ అగస్త్య మహాముని వల్ల ప్రతిష్టితంబైన స్వామి యా చోళ మహారాజు యొక్క స్వప్నమందు నేను ఫలానా జాగాన భూస్థాపితమై వున్నాను. నన్ను ప్రతిష్ట చేయమని ఆజ్ఞాపించి నందున అదే ప్రకారం చోళరాజు మర్నాడు ఆ స్థళానకుపోయి భూమి తొవ్వించి నంతట లింగం అగుపడి నందున అక్కడ దేవాలయము కట్టించి ఆ లింగం ప్రతిష్ట చేసి యీ దేవాలయానకు పశ్చమ భాగానసామీప్యముగా చన్నకేశవమూర్తి విగ్రహము చేయించి దేవాలయము కట్టించిరి."

అనే ఐతిహ్యాలనూ కూడా పలు గ్రామాలకు సంబంధించిన కైఫీయత్తుల్లో లిఖించబడి వున్నాయి.

## మాలెపాడు శాసనంకు విలువుంది - రక్షణ లేదు!

*మా మాలెపాడు వేణుగోపాల స్వామి గుళ్ళో రెండు పెద్ద శాసనాలుండాయి. మీరు యా చరిత్ర పుస్తకం తీసుకున్నా దీన్ల గురించి చెప్పివుంటారు. పోట్లదుర్తి - మాలెపాడు శాసనాలకు చరిత్రలో ఎంతో ప్రాధాన్యత వుండాది. రేనాటి కాలంనాటి చరిత్రకు, తొలి తెలుగు లిపికి ఈ శాసనాలే ప్రధాన ఆధారాలు. వీటి గురించి ఆలోచన చేసేటోళ్ళు ఇప్పుడెవరుండారు? ఎవరికి కాబడ్తా వుండాది? ఇట్టాటి శాసనాలు ఎవరూ గుర్తించడం లేదు. దీన్ల గురించి నేనే అంతో ఇంతో శ్రమపడి చరిత్ర సేకరించుకొని, దేవళంలో దాన్లను చూస్కుంటూ వుండాను. ఈ చరిత్ర నంతా ఎవ్వరైనా వచ్చి పరిశోధన చేయాలి. దీన్లను వెలుగులోకి తీసకరావాల. ల్యాకుంటే ఉపయోగమేముండాది? లిపి పోయిందంటే రాళ్ళే మిగుల్తాయి. అప్పుడెవరేంజేస్తారు?*

కుడుమల వెంకటరెడ్డి, మాలెపాడు గ్రామస్థుడు

## మా వూరికి పెద్ద కత వుండాది

*జనమేజయ మహారాజు చేత ప్రతిష్టించబడిన మూలవిరాట్ చెన్నకేశవస్వామి వూర్లోని వాళ్ళందరికీ ఆ దేవుడే మేలు చేస్తాండడు. ముందుగా ఎనుము ఈనితే పాలు ఇస్తాం. ఏ పంట పండినా దేవునికి నైవేద్యం పెడ్తాం. వూర్లో సగమందికి చెన్నకేశవ అనే పేరేవుండాది. నలబై ఎకరాల దేవుని మాన్యం వుంది. అయినా ధర్మకర్త లేడు. అప్పుడెప్పుడో శాసనాలు దేవళం గోడలకు పెద్దవి రెండుండాయి. ఇంగొకటి పెద్ద శాసనం గుడి చుట్టూ పరిచిన బండపరుపులో మా వాళ్ళు తెలియక పరిచినారు. దానిమీది అక్షరాలన్నీ చెరిగిపోయినాయి. యింగ అట్నే వదిలేసినాం. దాని విలువ ఎవరికి తెలుస్తా వుండాది? ఇప్పుడు దేవళంలో మూడు రాతిశాసనాలు వుండాయి. మన్రో కైఫీయత్తుల్లో గూడా మా వూరికత రాసి పెట్టుండారని చెప్తారు. ఎవ్వరైనా ముందుకొచ్చి ఈ శాసనాలకు ఏమైనా జేస్తే బాగనే వుంటాది. ఎవరు చేస్తారు?*

ఏనుగు కత్తి కేశిరెడ్డి, యర్రగుడిపాడు గ్రామస్థుడు.

# ఈ శాసనాలను ఎందుకు కాపాడుకోవాలి?

తొలి తెలుగు శాసనాలుగా లభించిన రేనాటి చోళుల కాలం నాటి శాసనాలు నాటి నుంచి రూపుదిద్దుకుంటూ వస్తున్న తెలుగు లిపి పరిణామక్రమాన్ని కూడా ఆవిష్కరిస్తాయి. ప్రాకృత, ద్రావిడ భాషల నుండి విడిపోయి వేరుగా తెలుగు లిపి నిర్మితం కావడం ఈ శాసనాల్లో కన్పిస్తుంది. శాసన భాషగా లిపి తయారు కావడం కూడా మనం గుర్తించవచ్చు. తెలుగు వాక్యములను అందించిన ఘనత కూడా రేనాటి చోళుల శాసనాలకే దక్కుతుంది. అప్పటికే వాడుకలో వున్న బ్రాహ్మీలిపినే కొన్ని మార్పులతో తెలుగు, కన్నడ వారు వాడుకున్నట్లు కూడా చెప్తాడు. సంస్కృత - ప్రాకృత - ద్రావిడ సమ్మిళితమైన భాషా స్వరూపం భాష మీద పడింది. రేనాటి చోళుల శాసనాలను మరింత లోతుగా పరిశీలించినట్లు అయితే అప్పటి తెలుగు వాక్య రచనా విధానం, ఉచ్చారణ సౌలభ్యం కోసం చేసుకున్న ఇతర మార్పులు మనకు స్పష్టంగా విశిదమౌతాయి. ప్రాకృత వాక్యాల స్థానంలో తెలుగు వాక్యాలు విశేషంగా ప్రవేశించాయని, దాని వల్లనే తెలుగు తొలి వాక్యాలు రాయడం క్రీ.శ. 575 రేనాటి ధనుంజయుని కలమళ్ల శాసనంతో ప్రారంభమైందని చరిత్ర కారుల భావన. అంతకు పూర్వం రెండు శతాబ్దాల నుండి కూడా కొన్ని వాక్యాలు వాడుకలో వుండి వుండవచ్చని కూడా ఊహించవచ్చు. దీని వల్లనే క్రమంగా తెలుగు భాష శాసన లిపిలోకి మారిందని చెప్తారు. ఈ లిపి అధ్యయనం మరింతగా జరగాలంటే మనం ఈ శాసనాలను పరిరక్షించుకోవాలి కదా!

తెలుగును శాసన భాషగా తీసుకొచ్చిన ఘనత రేనాటి చోళులకు దక్కుతుంది. వీరి గురించిన సమాచారం కలమళ్ల, తిప్పలూరు, మాలేపాడు, ముత్తుకూరు శాసనాల్లో కన్పిస్తుంది. మాలెపాడు శాసనంలో 'హిరణ్యరాష్ట్ర

సహితాన్ స్వరాష్ట్ర నివాసిన స్సర్వాన్ ఇత్థం ఆజ్ఞాపయతి’ అని పేర్కొనడం కన్పిస్తుంది. ధనుజంయుడు ‘వేయించిన శాసనాలు ఎర్రగుడిపాడులో లభించాయి. తొలితరం తెలుగు శాసనాలు రేనాటి చోళులకు సంబంధించినవే కావడం విశేషం. వీటి ద్వారానే తెలుగు భాషా సంప్రదాయ, స్వరూపాలు తెలుసుకోవడం సాధ్యమవుతుంది.

క్రీ.శ. 6వ శతాబ్ది నుంచి క్రీ.శ. 10వ శతాబ్ది వరకు తెలుగు లిపిలో వస్తున్న పరిణామ క్రమాన్ని రేనాటి చోళుల శాసనాలవల్ల అధ్యయనం చేయడం సాధ్యమవుతుంది. ద్రావిడ భాషలతోను, సంస్కృత ప్రాకృత భాషలతోను మన మొదటి తెలుగు లిపికి వున్న సాన్నిహత్యాన్ని నిరూపించడానికి, ప్రాచీనతను గుర్తించడానికి సాధ్యమవుతుంది.

రేనాటి చోళుల చరిత్ర మనకు సమగ్రంగా లభించడం లేదు. అందులోనూ అక్షరాల ‘పుణ్యకుమారుడి’ గురించి పట్టుమని పది వాక్యాలు వరుసగా మన అధికారిక చరిత్ర పుస్తకాల్లో కనపడవు. ‘సమగ్రాంధ సాహిత్యం’లో ఆరుద్ర కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. చరిత్రకారులు హెచ్. కృష్ణశాస్త్రి, నేలటూరి వెంకటరమణ్య, మల్లంపల్లి సోమశేఖరశాస్త్రి, వెంకట్రామయ్య, నీలకంఠ శాస్త్రి, జి. పరబ్రహ్మశాస్త్రి ‘రేనాటి చోళుల’ గురించి పరిశోధనలు చేశారు.

బి.ఎన్. శాస్త్రి, అవధానం ఉమామహేశ్వర శాస్త్రి, కె. శ్రీనివాసులు, పి. భాస్కరరెడ్డి వంటి చరిత్ర పరిశోధకులు కూడా కృషిచేసి ‘రేనాటి చోళుల’ సమాచారం అందించారు. డా. యం. ఆదినారాయణశాస్త్రి రాయలసీమ తెలుగు శాసనాలు - చరిత్ర’ పైన, ‘కడప జిల్లా శాసనాలు’ అంశంపైన డా. అవధానం ఉమామహేశ్వరశాస్త్రి పరిశోధన చేశారు. ‘రేనాటి చోళులు’ పేరుతో కె. శ్రీనివాసులు, ఉమామహేశ్వరశాస్త్రి సంయుక్తంగా ‘కడప జిల్లా చరిత్ర అధ్యాపకుల సంఘం’ నుంచి రచన వెలువరించారు.

**2013-14** సంవత్సరాన్ని ప్రపంచ తెలుగు మహాసభల్లో తీసుకున్న నిర్ణయాలకు అనుగుణంగా ‘తెలుగు భాష, సంస్కృతి వికాస సంవత్సరం’గా ప్రకటించుకున్నాం. రూ. 25 కోట్లు కూడా రాష్ట్ర ప్రభుత్వం కేటాయించింది.

ఉత్తర్వులు జారీ అయ్యాయి. మన నిర్లక్ష్యంతో మననుంచి చేజారిపోయిన తొలి తెలుగు శాసనాన్ని మళ్ళీ తెలుగు నేలపైన పునఃప్రతిష్ఠించుకుంటేనే నిజంగా మనకు సార్థకత.

కానీ ఇప్పుడేం జరుగుతోంది?

ఇలాంటి కీలకమైన చారిత్రాత్మక ఆధారాలన్నీ లిపిని కోల్పోతున్నాయి. రాతి బండలుగా మిగిలిపోతున్నాయి. నిజంగా వీటిని మనం రక్షించుకోకపోతే చరిత్ర మనల్ని క్షమిస్తుందంటారా?

## మరికొన్ని అనుబంధ అంశాలు...

- పుణ్యకుమారుడి దొమ్మరి నంద్యాల తామ్రశాసనంలో శివుడు, 'లకుటపాణి'గా వర్ణించబడ్డాడు.
- శ్రీకంఠ చోళుని మద్రాస్ మ్యూజియం తామ్రశాసనం 'శివస్తుతి'తో ప్రారంభమైంది.
- శివభక్తుడైన శ్రీకంఠ చోళాధిరాజు శ్రీ బాలశక్తి గురువుకు 'మందరం' అనే గ్రామాన్ని దానమిచ్చినట్లు శ్రీకంఠ చోళుని తామ్రశాసనం చెప్తోంది.
- క్రీ.శ. 7వ శతాబ్ది నాటి రామేశ్వరం శాసనం పోర్ముఖరామ పుణ్యకుమార పృథివీ వల్లభ చోటి మహారాజుల దేవేరి వసన్తిపోటి వసన్తీశ్వరానికి రెండు తోటలతో పాటూ రాచమానంలో మున్నూరు మరుతుర్ల నేల ఇచ్చినట్లు తెల్పుతోంది.
- హుయాన్‌త్సాంగ్ తన భారతదేశ పర్యటనలో రేనాటి చోళరాజ్యం నుండి కాంచీపట్టణానికి వెళ్ళినట్లు చరిత్ర కథనం.
- క్రీ.శ. 7వ శతాబ్దినాటి ఎర్రగుడిపాడు శాసనం - ఎరికల్ ముతురాజుల కుణ్డికాల్లు 'నివాపం' (మరణించిన పితరులకు పుణ్యం కోసం) ఒక బ్రాహ్మణునికి ఇరవై నాలుగు ముఱున్తుర్ల నేలను పన్నుగా ఇచ్చినట్లు చెప్తుంది.
- మహేంద్రవర్మ రెండవ కుమారుడు పుణ్యకుమారుడికి 'పృథివీ వల్లభ' అనే బిరుదు ఉంది. తిప్పలూరు, వెల్దుర్తి, రామేశ్వరం ప్రాంతాల్లో వీరు వేసిన శాసనాలు బయల్పడ్డాయి.
- రేనాటి చోళులకాలంనాటి 'నాణేలు' ఏవీ లభించలేదు.
- రేనాటి చోళుల కాలం నాటి 'పన్నులు' ఏవీ శాసనాల్లో పేర్కొనబడలేదు.




## కలమళ్ళ

1. ---
2. కల్ము (తు) రా -
3. జుధనంజ -
4. యు క్ష రేనా -
5. ణ్డు ఏళన్
6. చిఱుంబూరి
7. రేవణకాలు (పం)
8. పుచెనూరుకా (జు)
9. అ టి కళా ఊరి
10. (ణ్డ) వారు ఊరి
11. టి
12. ---
13. ---
14. ---
15. --- పఞ్చమ -
16. హాపాతకస --
17. కు

## ఎఱ్ఱగుడిపాడు

1. స్వస్తి శ్రీ ఎరిక -
2. ల్ముత్తురాజుల్ల
3. కుణ్డికాళ్లు (ని) వబు (కా)
4. ను ఇచ్చిన పన్నస
5. దజయరాజుల
6. ముత్తురాజులు నవ
7. ప్రియ ముత్తురాజులు
8. పల్లవ దుక రాజులు శక్షి
9. కను ఇచ్చిన పన్నస్ప



## రెండవ ప్రక్క

10. కొట్టంబున పా -
11. ఱకు కుణ్డికాళ్లు -
12. ళ ఇచ్చిన పన్నస
13. ఇరవదియాది నా -
14. ల్కు మఱున్తు ళ్ల నేల



## కలమళ్ళ

1. -- రేవణ (కా) లు -
2. పుద్దనకు కా --
3. అటిర --
4. వారు (ఊ---)

## కలమళ్ళ

1. శ్రీ భరద్వాజా గోత్రస్య పెన్వాఅ -
2. (వ) ప సమ్మాస్య పుత్రః రేవశమ్మాస్య గుడి

## ఇందుకూరు

ఉఱుగువుర

1. స్వస్తిశ్రీ చో ఱ మహా
2. రాజు ల్లేళన్ ఎరిగల్
3. దుగరాజుల్ ఇచ్చిన ప -
4. న్నస కొచ్చియ పాఱ (రే) -
5. వ సమ్మారికిన్ తేని ఱ -
6. చ్చినవా ళ్ పఞ్చ మహా
7. పాతక స(ం) య్యుక్తు ళ్గు
8. అసివై రువు లిఖిత



SCALE: ONE-SIXTH

# తిప్పలూరు

1. (స్వ)స్తి శ్రీఎరికల్ ముడు
2. (రా)జు పుణ్యకుమారు ఱ గణ్య
3. మాను ఱ మఙుం్రత్ర పిదుకు మదము -
4. దితు ఱ త్తమోత్తము ఱ యిన వా-
5. ఱ చెపఱలియ పటుకాను రేనాణ్డో-
6. ళుచు తక్కఱపుజోల పార(దా)యు
7. (కి) ఔ వూరు కత్తిశమ్మఱకు తిప-
8. ర పనాశ కొణ్డ కాత్తి(ఖ) చీకు-
9. రబిదియ సోమవారంబు పుణరు
10. పుష్యంబు బృహస్పతిహోర కా-
11. ను ఏమ్బుదియె చామణకాల ధ( ||*)



# వెల్దుర్తి

మొదటివైపు

1. (స్వస్తి శ్రీ)
2. (ఉత్తమా)
3. (దిత్య చో-)
4. ఆ (మ)హా -
5. రజు (ప్రి-)
6. థివి రాజ్య -
7. (ం) చేయ
8. ఇమ్మడి
9. ఈ (వి)*తో ఇచ్చి -
10. న పన్నవి -
11. స కొసియ
12. పఱ చెది
13. శమ్మ్ర (ళొ)చ్చిరి

రెండవ వైపు

1. ఎ(యర)
2. కల్లుకు (ఱ)
3. గట్టు(ళు)
4. (వె)న్దరంబు
5. ళు వెణ
6. వోజ-
7. ణ్ణ చక్షి
8. తేనికి వ-
9. క్రంబు వ-

మూడవ వైపు

1. పఞ్చుమ-
2. హాపత-
3. కు ణ్ణగు
4. కంచెఱు ప-
5. టి ఎఱుమ
6. ప్రసిరి
7. కొద్దలి
8. కుణవ-
9. ళువ
10. కొట్టె

# కలమళ్ల



శ్రీ చెన్నకేశవస్వామి - మూలవిరాట్



శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం





శ్రీ చెన్నకేశవస్వామి
ఆలయ ప్రాంగణంలో
నిర్లక్ష్యానికి గురైె పడివున్న
ప్రాచీన శాసనాలు.



*శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం బయట ఉన్న*
*విజయనగర రాజుల కాలం నాటి శాసనం*

శ్రీ చెన్నకేశవ స్వామి దేవస్థానము.మాన్యం

| సర్వే నెంబరు | విస్తీర్ణము |
|---|---|
| 29 | 12.16 |
| 103 | 1.29 |
| 483 | 14.24 |
| 131 | 0.06 |

పాత కలమల్ల.

శ్రీ సిద్దేశ్వర స్వామి దేవస్థానము.మాన్యం

| సర్వే నెంబరు | విస్తీర్ణము |
|---|---|
| 2/1 | 19.23 |
| 2/2 | 0.03 |
| 7 | 5.82 |
| 101 | 2.17 |
| 290 | 14.85 |
| 484 | 20.87 |

శ్రీ ఆంజనేయస్వామి దేవస్థానము.మాన్యం

| సర్వే నెంబరు | విస్తీర్ణము |
|---|---|
| 53/4 | 3.94 |

పాత కలమల్ల.

# యర్రగుడిపాడు



శ్రీ చెన్నకేశవస్వామి మూలవిరాట్



శ్రీ చెన్నకేశవస్వామి ఆలయ
గాలిగోపురం



శ్రీ చెన్నకేశవస్వామి ఆలయంలో ఎడమవైపు ప్రహరి గోడకు ఉన్న శాసనం



శ్రీ చెన్నకేశవస్వామి ఆలయంలో కుడివైపు ప్రహరి గోడకు ఉన్న శాసనం



ఆలయానికి ఆకృతి దాల్చిన శిల్పాలు





ఆలయ ప్రాంగణంలో నిర్లక్ష్యంగా పడి ఉన్న శాసనాలు







*ఇటీవల బయల్పడిన ప్రాచీనశాసనాలు*







*ఇటీవల బయల్పడిన ప్రాచీనశాసనాలు*



అగస్త్యేశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలోని ప్రాచీన విగ్రహం



*గర్భాలయం*



*ఆలయ స్తంభానికి చెక్కి ఉన్న శాసనం*

# రామేశ్వరం (ప్రొద్దుటూరు)



ఆలయ ప్రాంగణంలో ఉన్న శాసన సంపద

# చిలమకూరు



*శ్రీ అగస్తీశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలో ఉన్న ప్రాచీన శాసనం*

*శ్రీ అగస్తీశ్వరస్వామి ఆలయ ప్రాంగణంలోని స్తంభంపై ఉన్న శిల్పం*



*రేనాటి రాజ్యం*

## ఉపయుక్త గ్రంథాలు


1. Epigraphia Indica Vol. XXVII
2. Inscriptions of Andhra Pradesh -
   Cuddapah District Part - I (1977)
   (P.V. Parabhramha Sastry (Editor) Part II (1978)
   Government of Andhra Pradesh Part III (1981)
3. కడప జిల్లా శిలాశాసనములు - 1972
   (యన్. వెంకటరమణయ్య - సంపాదకుడు)
   Government of Tamilnadu.
4. South Indian Inscriptions - Vol. XVI 1988
   (నరసింహస్వామి, హెచ్.కె. సంపాదకులు)
5. తెలుగు శాసనాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
   (పరబ్రహ్మశాస్త్రి .జి)
6. South Indian Inscriptions - Vol. X. 1986
   (రామయ్య పంతులు, జయంతి (సంపాదకులు)
7. Selected Telugu Inscriptions
   (వెంకటరావు, నిడదవోలు)
8. కడప జిల్లా శాసనాలు - సంస్కృతి చరిత్ర
   (ఉమామహేశ్వరశాస్త్రి, అవధానం - 1995)
9. రాయలసీమ తెలుగుశాసనాల సాంస్కృతిక అధ్యయనం
   (ఆదినారాయణ శాస్త్రి .యం - 1995 జనవరి)
10. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - బి.యన్. శాస్త్రి
11. సమగ్రాంధ్ర సాహిత్యం - ప్రథమ భాగం - ఆరుద్ర
12. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి -
    ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందు శేఖరం.
13. South Indian Inscriptions Vol. X
14. రేనాటి చోళులు - కె. శ్రీనివాసులు,
    అవధానం ఉమామహేశ్వర శాస్త్రి,
    కడప జిల్లా చరిత్ర అధ్యాపకుల సంఘం.

15. చిత్తూరు జిల్లా, సమగ్రచరిత్ర - సంస్కృతి
- 'రేనాటి చోళులు' వ్యాసం పేజి 34-35
16. ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర - సంస్కృతి -
'రేనాటి చోళులు' వ్యాసం - పి. భాస్కరరెడ్డి
17. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము -
కందూరి ఈశ్వరదత్తు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య
అకాడమి, హైదరాబాదు 1979.
18. తెలుగుభాషా చరిత్ర - భద్రిరాజు కృష్ణమూర్తి,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1979.
19. Andhrula Charitra (Guntur)
Hanumantha Rao, B.S.L. (1985)
20. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర మొదటి భాగం -
కంభంపాటి సత్యనారాయణ
21. ప్రాచీన దక్షిణ భారత చరిత్ర, కవితా
ప్రభాస గ్రంథమండలి (1969)
నండూరి రామకృష్ణమాచార్య
22. Temples of Andhradesa -
Art, Architecture and Inconography (Delhi)
23. A Pallava Charter and Two copper
Medallions From Peddmudiyam' In,
Sri Ramachandrika, Vo. 1 (ef)
A.V.N. Murthy and I.K. Sarma, Delhi.
24. Peddachappali Plates of Srikantha
Sri Manohara - Epigraphica Indica,
Vol. IV : 13-51
25. The Cholas; Madras, 1972
K.A. Nilakantha Sastry
26. Chittoor through the Ages (New Delhi)
M.D. Sampath (1980)

27. Indian Epigraphical Glossary;
Motilal Banarsiclas, Delhi - 1966
D.C. Sircar
28. 'Telugu Chola Records from
Ananthapur and Cuddapah'
- Epigraphica Indica, XXVII : 220-51
K.A. Nilakanta Sastri and
M. Venkata Ramayya
29. Historical Geography of Ancient India,
Paris, 1967 by B.C. Law
30. 'Inspection of Kokkili Raja'
the Journal of Oriental Research,
Vol. XXXVIII : 14-16 (Madras)
- M. Venkata Ramayya

## వ్యాసాలు

తొలితెలుగు శాసనాలను కాపాడుకోలేమా? - వ్యాసం
రచన : డా॥ వేంపల్లి గంగాధర్; 16 నవంబర్ 2008
ఆదివారం ఆంధ్రజ్యోతి

మట్టిపొరలమధ్య మహాచరిత్ర; కడపకు 200 వసంతాలు
రచన : డా॥ వేంపల్లి గంగాధర్; డిసెంబరు 30 - జనవరి 5, 2008
ఈవారం వారపత్రిక

తెలుగుకు వెలుగు; తెలుగుకు ప్రాచీనహోదా
రచన : డా॥ వేంపల్లి గంగాధర్; 16 నవంబర్ 2008
ఆదివారం ఆంధ్రప్రభ

తొలి తెలుగు శాసనానికి వెలుగు ఉందా?
రచన : డా॥ వేంపల్లి గంగాధర్; 15 ఏప్రిల్ 2013
సాహితి, ఆంధ్రభూమి దినపత్రిక

తొలి తెలుగుశాసనం ఎక్కడ?
రచన : డా॥ వేంపల్లి గంగాధర్; 15 ఏప్రిల్ 2013
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక.

# నివేదిక




తొలితెలుగు 'కలమళ్ళ శాసనం' ఎక్కడ ఉందో రాష్ట్ర ప్రభుత్వం వైపునుంచి అన్వేషణ చేపట్టాల్సిందిగా కోరుతూ 26 ఏప్రిల్ 2013నాడు నివేదికను రాష్ట్ర అధికార భాష సంఘం అధ్యక్షుడు మండలి బుద్ధప్రసాద్‌ను హైద్రాబాద్‌లోని సచివాలయంలో డా॥ వేంపల్లి గంగాధర్ అందజేశారు. ఈ సందర్భంలోనే రాష్ట్ర సాంస్కృతిక శాఖ సంచాలకులు డాక్టర్ రాళ్ళబండి కవితా ప్రసాద్ గారి దృష్టికి కూడా ఇదే అంశాన్ని తీసుకెళ్ళడం జరిగింది. తొలి తెలుగు శాసనం నమూనా శిలాఫలకాన్ని కడప జిల్లాలో ఏర్పాటు చేయవలసిందిగా కోరడమైంది. రాష్ట్ర సాంస్కృతిక శాఖ, దేవాదాయశాఖ, అధికార భాషా సంఘం, పురావస్తు శాఖల సంయుక్త సమన్వయంతో ఒక ప్రణాళిక రూపొందిస్తామని మండలి బుద్ధప్రసాద్ హామీ ఇచ్చారు.

అనంతరం 15 మే 2013నాడు చెన్నై ఎగ్మోర్ ప్రభుత్వ మ్యూజియంలో తొలితెలుగు శాసనం కోసం తమిళనాడు రాష్ట్ర గవర్నర్ కె. రోశయ్య గారి ప్రత్యేక జోక్యంతో అన్వేషణ సాగించారు. మండలి బుద్ధప్రసాద్ గారితో పాటూ మునిరత్నం, సోమసుందరరావు, విజయకుమార్, ఎస్. నాగార్జున, యేసుబాబు, వేదాంతం రాజగోపాల చక్రవర్తి, మాడభూషి సంపత్‌కుమార్ ఈ బృందంలో వున్నారు. రెండు రోజులపాటూ ప్రయత్నాలు జరిగినా శాసనం ఆచూకీ తెలియరాలేదు.




కేంద్ర సాహిత్య అకాడమి యువపురస్కారాన్ని
డా॥ వేంపల్లి గంగాధర్‌కు ఆగస్టు 25, 2012నాడు,
భువనేశ్వర్‌లో ప్రదానం చేస్తున్న అకాడమీ అధ్యక్షులు
సునీల్ గంగోపాధ్యాయ

